## శిక్ష ఎవరిది?

అయ్యా, పాలకొండయ్యగారూ!
ఆంధ్రుల అభిమాన పత్రిక ద్వారా
అభినందించాం మీ కవిత 'పరీక్షలు' చదివినందుకు
బాధపడ్డాం అసలు కీలుకు మీరు దాచేసినందుకు
విద్యార్థులకూ అధ్యాపకులకూ లేకుంటే పొత్తు
ఏనాడో అంటువుండేవి పాఠశాలలు చిత్తు
అస్తవ్యస్తంగా వుంటుంటే అధికారుల జీవోలు
అవకతవకలు లేకుండా ఎలావుంటాయి పరీక్షలు?
హాజరు బాగుంటేచాలు
అధిగమిస్తున్నాడు పై క్లాసుకు విద్యార్థి
విద్యార్థి కాదిప్పుడతడు
నిశేషించి హాజరుకు అర్థి
సిలబసులకే నియమితం కాలేదు అధ్యాపకులబోధన
బోధన చేసినప్పటికిందుకోనే నాథుడు లేకనే వారి తపన
విడువబడాం అన్నమాటే మరిచాడు విద్యార్థి
మార్కులకోసమేనా
పై క్లాసుకు నెట్టబడుతున్నారు 'జీవో'లతస్ని
చదువెలావుస్తా
ఆలోచన మంచిదే బనా హడావిడిగా ప్రవేశ
పెట్టబడ్డాయి, యీ జీవోలు
హాయి మనకు లభించిందనుకుంటే విద్యార్థులు
అయోమయంగా తలపట్టుకుంటున్నారు అధ్యాపకులు
పరీక్ష తేలా ప్రాసిన ప్రమోషనంటూ
పుస్తకాలుమాత్రం పెట్టారు కొల్లలు
హాజరు వేయించుక విద్యార్థి హాయిగా వుంటే
చదువుకోవాలిక వాటిని అధ్యాపకులు.
బోధన బోరింగ్ కాలయాపనగా
పరీక్షలు పరమపదంగ విన్యాసంగా
మారబోవడానికి సరైన కారణంగా
మీరు చెప్పింది వుందంటారా సక్రమంగా?

కె. వి. శర్మ (పకామిడికుదురు)

## ఉత్తరాలు

### సినిమా

సినిమాగూర్చి ఎవ్వరూ ఇవ్వనంత న్యూస్ శ్రీనివాస్, మోహన్ కుమార్ గార్లు పత్రికద్వారా ఇస్తున్నందులకు వారికి నా ధన్యవాదాలు.

స్వర్ణ సుబ్బరాయుడు (తిరుపతి.)

* * *

ఆంధ్రుల అందాల అభిమాన కథానాయకుడు యన్. టి. రామారావుగారితో ఇంటర్వ్యూ—ఈ సంవత్సరము ఇంతవరకు ఆయనను తెరమీద చూడటానికి నోచుకోని మాకుకొంచెం రిలీఫ్ నిచ్చింది. ఆయన సినిమాలు తగ్గించడం మాలో వినోదం సగపాలు తగ్గిపోయింది.

—వెంకటేశ్వరరావు, & ఫ్రెండ్స్ (పాలేరు.)

* * *

కృష్ణ విదేశాలలో అవుట్‌డోర్ షూటింగు జరుపుతారని చదివి ఎంతో సంతోషించాము. తెలుగు చలన చిత్రపరిశ్రమకే వెన్నెముక వంటివాడు కృష్ణ!

పి.బి.సుందర్‌రెడ్డి, లలిత, (విజయవాడ)

### ముఖాముఖీ

హీరో కృష్ణ, చంద్రకళ, దేవికగార్లతో మోహన్ కుమార్‌గారి ముఖాముఖి చాలాబాగుంది. 'గన్‌ఫైటర్ జానీ' 1.66 పైసల టికెట్ బ్లాక్‌లో 100రు. అమ్మిన విషయం మమ్మల్ని ఆశ్చర్యపరచింది. మన తెలుగువారికి, తెలుగు చిత్రాలకు ఇంత విలువ ఉందా అనిపిస్తోంది. ఇంగ్లీషు వెర్షన్ ప్రపంచమంతా విడుదల చేయబోవడం, నిజంగా తెలుగువారు గర్వించదగ్గ విషయమే. ఇక్కడ తెలుగువారి పురోగతి తెలుస్తోంది. పారిస్‌లో షూటింగు ఇంతవరకు తెలుగువారెవరూ చేయలేదు. ఆ ఘనత కృష్ణ గారికే దక్కింది.

కె. ఉమ (తెనాలి)




# ఆంధ్రపత్రిక వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 16—6—72
(శ్రీపరీధావినామ సం॥ జ్యేష్ఠ మాస॥ శు॥ పంచమి

సంపుటము: 60 సంచిక: 43

స్థాపితము:
1908

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: హిందీ సినీనటి ........ యా.
మూడవ అట్ట పేజీలో: వెంకట్రావ్ కొల్లి
(కార్టూన్ సీరియల్)


కథలు:

| | |
|---|---|
| ఏడు ఉత్తరాల కథ | — 6 |
| శేషగిరి—శకుంతల పీక | — 10 |
| తీయనికలలూ తీరనివేదనలూ | — 17 |
| నేను మామూలు మనిషిని (పెద్దకథ ప్రారంభం) | — 32 |
| నమాజు | — 48 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| నాలుగు మంచాలు | — 24 |
| నాగధార | — 40 |

వ్యాసాలు, శీర్షికలు, సినిమా:

ఉత్తరాలు — 2, ఊహన్ కార్టూన్ 5, శుక్రవారం నివసీతం — 9, ప్రశ్నావళి — 16, ఏడుకొండలవాడికి మొక్కు (గేయం) — 18, పిల్లలు — ఆరోగ్యము — 23, చిరుమల్లెలు (గేయం) — 26, బాగుపడి పని పాడుచేయకండి — 31, దర్మవృత్త శిక్ష — 34, వారఫలం — 38, పండదోరా మంచి పడకు (గేయం) — 46, దర్శపథం — 47, హరిరాన్ (కార్టూన్) — 50, నటి జయతో ఇంటర్వ్యూ — 55, సినిమా — 56, సినిమాడైరీ — 58, మీకు తెలుసా? — 60, లకూ—లకూ—63, పుస్తకాలు—64




1

సంపాదక మహాశయా!

10—1—69

నమస్కారములు

మీకు లోగడ చాలాసార్లు శుభాకాంక్షలు పంపాను. పోతే నేను రాసిన కథలు రాసినట్లుగా మీకు ఎప్పటినించో పంపుతున్నాను. పంపినవి పంపినట్లే వెనక్కి తిప్పి పంపుతున్నారు. తిప్పి పంపటానికి స్టాంపులంటించి పంపటంవల్ల నేమో! యిక స్టాంపులు అంటించకుండానే ఈ కథ పంపుతున్నాను, దయచేసి ప్రచురింప గలరు.

భవదీయుడు
ఉత్తరాలరావు.

2

సంపాదక మహాశయా!

10—2—69

నా కథ మళ్ళి తిప్పి పంపబడింది. స్టాంపులు పెట్టకపోయినా! అంచాత తేలిందేమిటంటే నా పేరు కన్పిస్తే చాలు తిప్పిపంపే కథలు మాత్రమే రాసే రచయితగా నాకు ముద్రవేసినట్లున్నారు. ఈ దఫా అన్నా దయయుంచి యీ ఒక్క కథా ప్రచురించండి. దీన్ని ప్రచురించాలని ఆంధ్రప్రదేశ్‌లోని అందరు దేవుళ్ళకీ మొక్కుకున్నాను.

ఉంటాను మరి
ఉత్తరాలరావు.

3

మహాశయా!

మీకు ఉత్తరాలు రాసినా లాభం లేకపోయింది. మీరింత నిర్దాక్షిణ్యంగా ఎందుకు వ్యవహరిస్తున్నారో తెలీకుండా వుంది. దయయుంచి యీ కథ ప్రచురించండి. లేదా నేను కోర్టుకు పోతాను. ఇప్పటికి మీకు పంపిన కథల సంఖ్య దస్తా! అవి రాయటానికి నాకు ఖర్చయిన కాగితాల సంఖ్య బస్తా!

ఉంటాను మరి
ఉత్తరాలరావు.

4

మహాశయా!

9—3—69

ఇన్నాళ్ళకు నా కలలుపండాయి. మీరువెట్టకేలకు నా కథ ఒకటి ప్రచురించారు. వెంటనే ఆ పత్రిక కొనేసి త్వరగా మా ఆఫీసరుకు చూపించి కంగ్రాట్యులేషన్స్ అన్పించుకొన్నాను. పత్రిక మాత్రం మళ్ళి యివ్వలేదు. చూసి యిస్తానని మాత్రం చెప్పాడు. ఇంకో కాపీ కొన్నాను. మా ఆఫీసు స్టాఫ్‌కిస్తు ఆనందమ్మో తేల్దామని. నాచేతిలోని పత్రికను క్షణాంతరం అరడజను మంది కత్తుల రత్తయ్యలూ రావణబొవులు ఎగబడి గుంజుకొన్నారు. ఏమైనా నేను వదలకపోవటంతో మీ పత్రిక ముఖచిత్రాన్నొకరూ, విడివిడి కాయితాలు మరోరూ చింపుకొని పోయారు. ఆఖర్కొచ్చు వాళ్ళ

నా స్నేహితులే అనుకోండి. అయినా పత్రికకొని చదివే తెలివి మనవాళ్ళలో పెరగలేదు ఏమంటారూ?

కథ మా శ్రీమతికి చూపుదామంటే వీలుపడలేదు. దయచేసి నా కథపడ్డ కాపీ ఒకటి పంపించరూ! ఈ ఊళ్ళో పర్క్యులేషన్‌కి వచ్చినవన్నీ కొనేశాను. ఇక దొరకవు మరి.

ఉంటాను, శెలవు.
(మీ) (మా) పత్రిక రచయిత
ఉత్తరాలరావు.

తాజాకలం: తిరుపతి వెంకన్న ముడుపు ఋవాశే పోస్టు చేశాను. సత్యనారాయణ వ్రతం చేసికొన్నాము.

## 5

మహాశయా

10-4-69

నా కథ పడి చాలా రోజులైంది. తర్వాత నే రాసిన కథలు అపరిమితం అయినా వాటి గోడెవరు పట్టించుకుంటారూ? మీరు ప్రచురించిన కథలకి పారితోషికం పంపుతారని ఇక్కడందరూ చెబుతున్నారు. నేను రోజూ పోస్టు మ్యాన్ కోసం ఎదురు చూస్తున్నాను. ఈ సంగతి మీకురాస్తే యిక మీరు నా కథలు ప్రచురించరని మా ఆవిడ బెదిరిస్తోంది.

కనీసం నాకు పారితోషికంగా ఒక్క ఉత్తరం ముక్కచాలు.

ఉత్తరాలరావు.

## 6

అయ్యా ఉత్తరాల రావుగారూ!

20-4-69

మీరు వ్రాసిన కథ 'తొడిమలేని పూవు' గురించి, జెకోస్లవేకియా, అమెరికాలలోని పాఠకులు ప్రశంశిస్తూ ఉత్తరాలు రాశారు. కాని కొందరు పాఠకులు 'పూవులేని తొడిమ' అనే కథను మా పత్రికలో రెండు సంవత్సరాల క్రిందట ప్రచురించిన దాన్ని కృతఘ్నుంగారిరచననూ, మీ కథనూ కాపీలు పంపుతూ 'కృతఘ్నుంగారి కథను మీరు మక్కీకి మక్కీగా దొంగిలించారు' అని ఆరోపించారు. పాఠకులు చాలా తెలివైన వారుంటారు.

పోతే మీ కథా ప్రచురణ గురించిన వివరాలు యిప్పుడిస్తున్నాం! ఆ కథ ఒక ఉపసంపాదకునికిచ్చి త్రిప్పిపంపించమని చెప్పాం. ఆయనగారి కుడిచెవ్వ దగ్గర ఒకటి ఎడమ చెవ్వదగ్గరఒకటి చొప్పున ఆటంబాంబులు పేల్చినా ఆయనకు చీమ కదిలినప్పుడు చప్పుడుకానట్టే ఏమీ విన్పించనంత చెవుడుంది. అంచాత ఆయన ఆ కథను మా ప్రెస్‌కి పంపేసి పూరుకున్నాడు. 'ముందు పంపారా?' అని మేం అడిగితే వనిగట్టుకపోయి మా పత్రికలో ముందు కథగా వేసిపారేసెయ్యమని చెప్పార్ట ప్రెస్సులో.

అంచాత మీరు (రాయని) ఆ కథకు పారితోషికం ఆశిస్తున్నారని తెల్సింది. అయినా మేమా కథకు శ్రీ కృతఘ్నుంగారికే పంపాము. వారు స్వర్గీయులైనారని తెల్సినా గూడా!

మీరు యికనుంచి స్వంతరచనలు చేయటం చాలా అవసరం! ఇకముందు (మా) (మీ) పత్రిక మీ రచనలు ఏవీ ప్రకటించవదని మనవి.

సంపాదకుడు
కథాగులిక.

# ఏడు ఉత్తరాల కథ
## 7

సంపాదక మహాశయా!

తేది: 20-5-1969

ఇది ఆఖరి వుత్తరం. నా కథ ఇతర దేశాలవాళ్ళు చదివారు గాబట్టి అంతర్జాతీయ ఖ్యాతి నందిరంది. పోతే కథా దొంగతనం గురించి....

నేనీ కథను లోగడనే గత కొన్ని సంవత్సరాల క్రిందట రాశాను. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుంది. శ్రీయుత కృతఘ్నంగారి కుమార్తె వరాహలక్ష్మి కి నాకుండే పరిచయంవల్ల నేనామెకు ఆ కథ యిచ్చి కృతఘ్నంగార్ని సరిచేసి పంపవలసిందిగా కోరాను వారు ఎన్నాళ్ళకీ నాకు జబాబు యివ్వకపోటంతో నేను ఆ కథ కాపీ నా దగ్గరుంటే నేను పంపించాను, ఏలాగూ తిప్పి పంపుతారనే నమ్మకంతో!

ఇకముందునుంచి నా కథలు ప్రచురించబోయేముందే, మీ పాతసంచికలు తిరిగేయటం ముఖ్యం!

సెలవు

ఉత్తరాలరావు.

పాఠకులకి మనవి.

శ్రీయుత కృతఘ్నంగారు చాలా సంవత్సరాల క్రిందట వ్రాసిన 'తొడిమలేని పువ్వు' అన్నకథని శ్రీ ఉత్తరాలరావుగారు 'పువ్వులేని తొడిమ' అనే పేరుతో పంపారు. రెండు కథలు మా (మీ) పత్రికే ప్రకటించింది. అసలు రచయిత శ్రీ కృతఘ్నంగారా! ఉత్తరాలావా? అన్న సమస్య తేలక మేం ఇద్దరికీ ఉత్తరాలు రాశాం. శ్రీ కృతఘ్నంగారు స్వర్గస్థులై వుండటంవల్ల పోస్టువాళ్ళు ఆ వుత్తరాన్ని ఎక్కడికో 'రీడైరెక్టు' చేశారట! ఇలా 'కథ' ఒక్కటే ఇద్దరు రచయితలుండటం దురదృష్టం. ఇకముందునించి ఇలాంటివి జరగకుండా చూడగలం!— ఈ ఉత్తరాల మూలంగా మా సర్క్యులేషన్ పెరిగింది. కథా దొంగతనాన్ని పట్టియిచ్చిన డిటెక్టివ్ పాఠకులకు కృతజ్ఞులం — ఇక దీనిపై ఉత్తరప్రత్యుత్తరాలు జరగవు.

సంపాదకుడు

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## గుర్తు తెలిని శవం

ధర్మపురి తాలూకా బెంకిని—కోట్టై అయిం జాడి రోడ్డుమీద లోహనూరు గ్రామంప్రాంతంలో వో శవం దొరికిందట. ఈ వ్యక్తి ఎవరో ఎవరికి తెలియరాలేదట. 40 ఏళ్ళ వయస్సున్న ఆతనిని ఎవరో పీక నులిపి, బహు దారుణంగా చంపి ఉండా లని పరీక్ష చేసిన డాక్టర్లు అన్నారట.

## చెవుల దుద్దుల కోసం స్త్రీ హత్య

చిత్తూరు నరసింగపురానికి చెందిన కృష్ణయ్య అనే వ్యక్తి జోగి తిమ్మారెడ్డి అనే అతని భార్య

ఇదిగో వచ్చేస్తున్నా దుద్దులు తీసేసి



మునెమ్మను పీక నులిపి చంపేసి, ఆమె చెవుల దుద్దులుకోసం ఆమె చెవులు కోసి తీసుకు పారి పోయాడట. ఇతనికి ప్రభుత్వం యావజ్జీవ కారా గార శిక్ష విధించింది.

## లాంతరు స్తంభంలో విద్యుత్తు - ఒకని మరణం

కీళ్ వెళ్ళూరు అనే గ్రామానికి చెందిన పెరియ సామి అనే అతని కొడుకు కృష్ణన్ చేపలు పట్ట డానికి కాలువకు వెళ్ళాడట. కాలవలో చేపలు పడుతూ, పక్కనే ఒరిగివున్న వో లాంతరుస్తంభం మీద యధాలాపంగా చేయి వేశాడట. ఆ స్తంభంలో కరెంటు ప్రవహిస్తుండడంవల్ల విద్యుత్‌ఘాతానికి కృష్ణన్ వొళ్ళు కాలిపోయిందట. వందవాసి ఆస్ప త్రిలో చేర్పినా, ఫలితంలేక అతను చనిపోయా డట.

* * *

సేలంకు చెందిన నావక్కాళ్ అనే వూరిలో 35 ఏళ్ళ ఆర్ముగంసెట్టియారు తను చేస్తున్న వ్యాపారంలో తీవ్ర నష్టం వచ్చి, అది తట్టుకోలేక ఘాతుకానికి పూనుకున్నాడట. 27 ఏళ్ళ తన భార్య తంగమ్మకు, ఏడేళ్ళ సదాశివం, ఆరేళ్ళ సింగార వేలు అనే కొడుకులకు, నాలుగేళ్ళ కనకేశ్వరి, ఒకటిన్నర ఏళ్ళ వాసుకి అనే కూతుళ్ళకు విషం కలిపి పెట్టాడట. కాసేపటికి ఆ అయిదుగురూ చనిపోయాక, తానూ ఆ విషాన్ని తిని, తిన్నగా తన తల్లి యింటికి వెళ్ళి జరిగినదంతా అక్కడ చెప్పేసి, తాను పడి చనిపోయాడట.

## నూలుమిల్లుకి అగ్నిప్రమాదం

జునఘడ్‌కు 37 కిలోమీటర్ల దూరంలో వున్న మానావదర్ అనే చోట నో నూలుమిల్లుకు నిప్పంటు కుని 25 లక్షల కిమ్మత్తు చేసే పత్తిబేళ్ళు సర్వ నాశనమైపోయాయట.

## సానుభూతి సూచకంగా జుట్టు తగ్గింపు!

'యువకులారా! వియత్నాం మిలిటరీ వాతా వరణంపట్ల మీ సానుభూతి చూపుతూ మీరు మీ మీ జుట్టులను తగ్గించుకోండి. అంతంత జుట్టు వలదు. బాగా చిన్నా చిన్నగా చేసుకోండి' అని సాయ్‌గాన్‌లో మేయర్ కల్నల్ దోకేనే నిహ్వా యువతరాన్ని కోరారట. 'సరదా సంగీతం పాడే యువకులు తమ జుట్టు భుజాలమీద పడేవరకూ పెంచుకోడానికి లైసెన్సు వుందట. మే 31 వ తేదీలోగా యీ పని అమలులోకి తేవాల్సినదని కూడా ఆయనే అన్నారట.



బొంబాయినుంచి వెలువడే ఇంగ్లీషు వార పత్రిక 'కరెంట్' 27—5—1972 తేదీ సంచికలో పడిన ఒక శీర్షిక (మంత్రులు కొత్త కార్లు కావాలంటున్నారు) లోని ఒక పేరాకి అను వాదం.

'ఒకరోజు (మంత్రిగారి పాత) కారు రోడ్డు మీద ఆగిపోయింది. మంత్రిగారికి కారుతోలటం రాదు కాబట్టి డ్రయివరుతో చోట్లు మార్చు కొనడానికి వీలులేకపోయింది. మంత్రిగారికి కారు తొయ్యటం తప్పలేదు. మంత్రిగారి అవస్థని ఒక కానిస్టేబులు చూశాడు. వెంటనే ఎటెంషన్‌లో నుంచుని ఆయనకి సెల్యూట్ కొట్టాడు. మంత్రి గారు కారు తొయ్యటం చూశాడుకాని తను సాయం చెయ్యలేదు. కానిస్టేబులు మంత్రిగారికి సెల్యూట్ కొట్టాలిగాని ఆయన కారు తొయ్య నవసరంలేదు.'

ఈ కథని చెప్పినది మంత్రిగారేట. తమకి కొత్త కారు అవసరం అనే వాదాన్ని బలపరచ టానికి చెప్పారుట. (ఈ కథ ఇంతటితో ముగియ లేదుట. ఇక పయిన మంత్రుల కార్లు ఆగిపోతే కానిస్టేబుళ్ళు వాటిని తొయ్యాలనే ఆర్డరు జారీ అయిందిట— సరా:— మంత్రులే దిగి కార్లు తోస్తేనే కానిస్టేబుళ్ళు ఈ పని చెయ్యాలి. దీని ఫలితంగా మంత్రిగారికి సెల్యూట్ దక్కకపోవచ్చు. ఈ లాంఛనాన్నివారు వదులుకోవలసి రావచ్చు.)

హలో ఇంజనీర్ హలో డాక్టర్



## ఉద్యోగాల క్యూలో వైద్యులు!

పవిత్ర భారతదేశంలో 1971 డిశంబరు నాటికి 3,953 మంది డాక్టర్లు పట్టా పుచ్చు కున్నవారు ఉద్యోగాల క్యూలలో నిలబడి ఉన్నారట. వీరిలో 1400 మంది ఆంధ్రప్రదేశ్‌లోనూ, 443 ఒరిస్సాలోనూ, 440 ఢిల్లీలోనూ, 415 మంది కేరళలోనూ, 380 మంది మైసూరు లోనూ ఉన్నారట. ఇంజనీరుల నిరుద్యోగ సమస్య సంగతి అలా వుంచగా యీ సమస్యా అంత తేలిగ్గ కూర్చుందన్నమాట.




ఆ రోజు శేషగిరి వస్పేసే యూని వర్శిటీకి సెలవు. అయినా శాయశక్తులా శకుంతల హడావిడి పడ్తోంది. మరోరజై యుంటే శకుంతల హడావిడి పడకపోనేమో గాని ఆ రోజు శుక్రవారం. ఆ రోజు పత్రికల అబ్బాయి పత్రిక ఇచ్చేరోజు. అందుకనే వీధిలో అలికిడి అవగానే, పోపు పెట్టడానికి నూనె గరిటలో నూనె ఒంప బోతున్న శకుంతల నూనె పీసా అక్కడే వదిలేసి చేతికంటిన జిడ్డు తుడుచుకోడానికి యధాప్రకారం తుండుగుడ్డ కనిపించక పిడకొంగు అందుబాటులో వుండటంచేత దాన్నే అందుకుని చేతులు శుభ్రంగా తుడచుకుని వీధిలోకి పరిగెత్తింది. నిరాశ ఎదురైంది. వంటింట్లోకి వెళ్ళగానే ఆ అమ్మాయి అత్తగారు పార్వతమ్మ, ఆవిడ అత్తగారు శాంతమ్మ ఏకకంఠంతో 'పత్రిక రాలేదా?' అని అడిగారు. వాళ్ళకికూడ పత్రికపట్ల శకుంతలకున్న ఆత్రుతే వుంది. సీరియల్ మంచి రసపట్టులో వుంది. కిందటి వారం సంచికలో విజయ, శర్మతో 'శర్మా! నేను, నిన్ను ప్రేమిస్తున్నాను. నేను మానాన్న ఇచ్చే ఆస్తి వదులుకోడానికి సిద్ధంగా వున్నాను. మనిద్దరిమధ్య మన కులాలు అడ్డురావని అనుకుంటున్నాను కాని దైవనిర్ణయం ఎల్లావుందో! నీతో కలిసి పయనించే అదృష్టం కగిలితే, నేను నిన్నుకాని భగవంతుడినికాని ఏమీ కోరను' అంది. ఆ వాక్యాలు, వంటచేస్తున్న అత్తగారి కోసం, పూజచేస్తున్న అమ్మమ్మగారికోసం బిగ్గరగా చదివిన శకుంతల 'ఆడపిల్ల, ప్రేమ విషయంలో అల్లా బయటపడిపోతే జీవితాంతం మొగుడికి లోకువైపోదూ! ప్రేమించి పెళ్ళాడిన మొగుళ్ళే చీరలు కొనటం విషయమొచ్చే సరికి చెముడు నటిస్తారు కదా!' అని బాధపడింది.

శకుంతల వుద్దేశంలో ఆడపిల్ల బజారులోకి వచ్చిన చీరల్ని కొనుక్కొని కట్టుకోడానికే భగవంతుడిచేత సృష్టింపబడింది. అయితే కట్టుకున్న చీరలకి సార్థకత వుండాలంటే ప్రతి ఆడపిల్లకి విధిగా ఓ భర్త వుండాలి. ఆ భర్త ఈ సదరు ఆడపిల్లకు విధిగా ప్రతినెలా చీరలు కొనాలి. అందుకనే భగవంతుడు అబ్బాయిల్ని సృష్టించాడు. శకుంతలకున్న ఈ గట్టి అభిప్రాయంతో ఇంతో అంతో పార్వతమ్మ, శాంతమ్మ ఏకీభవిస్తారు.

అయితే అవే వాక్యాలు క్రితం వారం రైల్లో చదివిన శేషగిరి జేబులోంచి పెన్ను తీసి 'ఇంకేం కోరను' అన్న మాటల పక్కన 'నెలకోటో రెండో చీరలు తప్పించి' అని రాసాడు. ఆ పైన ఆ అక్షరాల్ని చూసి మురిసిపోయాడు. అవి అందంగా వున్నందుకు కాదు. అందంగా లేవు. కాని అవి తనలో కలిగిన భావ వీచికకి భౌతిక నిదర్శనం. శేషగిరికి ఆరోజు తను రాసిన మాటలు వేద వాక్యాలలాగా పొల్లు పోనివని ఓ నిశ్చితాభిప్రాయం చాలారోజులుగా వుంది. ఖచ్చితంగా చెప్పాలంటే అయిదేళ్ల మూడు నెలలబట్టీ వుంది. సరిగ్గా అన్ని రోజుల క్రితం అతనికి పెళ్ళయింది. శేషగిరి శకుంతలని గాఢంగా ప్రేమించి, ఆ పైన తన బామ్మని కాళ్లావేళ్లా పడి బతిమాలుకుని తను శకుంతల్ని పెళ్లాడ్డానికి ఆవిడని వొప్పించి పదిమందెదుటా తాళి కట్టాడు. ఆ పైన పెళ్లినాటి రాత్రి శకుంతల 'ఇక నాకు చీరలు కొనే బాధ్యత నీదే గిరీ!' అంటే సరేనని శకుంతలతోపాటు ఆ బాధ్యతల్ని కూడా మీదకు లాక్కున్నాడు. ఆ బాధ్యత బరువు అయిదేళ్ల వివాహ జీవితంలో అతనికి బాగానే తెల్సొచ్చింది.

శకుంతల పెళ్ళయ్యాక శేషగిరితో విశాఖపట్నం బయల్దేరింది. కాపురానికి వెళ్లటం అంటే మాటలా ఎన్ని చీరలు సర్దుకోవాలి! ఎంత కష్టం! అందుకని శకుంతల దీక్షగా చీరలు సర్దుకుంటుంటే శేషగిరి చిన్నవాడిలా అడ్డురావటం మొదలు పెట్టాడు. 'నా బంగారు కొండ కదా! కాస్త దూరంగా ఆ మంచం మీద కూర్చో గిరీ!' అంటూ శకుంతల మెత్తగా విసుక్కుంది. శకుంతల పెట్టెల్లో బట్టలు సర్దటం పూర్తయ్యేసరికి శేషగిరి 'అరవై మూడు' అని బయటికి లెక్కపెట్టాడు. శకుంతల 'అరవై మూడు ఏమిటి మధ్యలో' అంది.

శేషగిరి తన వుపాధ్యాయ వృత్తి వల్ల అడగబడిన ప్రశ్నకి జవాబు చెప్పక పోవడం జవాబు తెలియని మేష్టర్ల పద్ధతనే అభిప్రాయాన్ని ఏర్పరుచుకున్నాడు. ఆ పైన జవాబు చెప్పటమే కాకుండా చెప్పేది నిర్దుష్టంగా వుండాలి అని కూడా నమ్మేవాడు. అందుకని 'నువ్వు నన్ను దూరంగా తోలెయ్యకముందు ఎన్ని చీరలు సర్దావో తెలియదు కాని నన్ను దూరంగా నెట్టేసాక పెట్టెల్లో పెట్టిన చీరల సంఖ్య అరవై మూడు' అని నిక్కచ్చిగా సమాధానం ఇచ్చాడు. శకుంతలకి చీరలంటే ఎంత ఇష్టమో తనకి ఎక్కువ చీరలున్నాయని ఎవరైనా అంటే అంత కోపం. శకుంతల అందుకని తన మూడు నాళ్ల వివాహ జీవితంలో మొదటిసారిగ మనస్సు కష్టపెట్టుకొంది. ముఖ్యంగా శేషగిరి శకుంతలతో 'నీకెన్ని చీరెలున్నాయో' అనో 'నీకు చాలా చీరలున్నాయి!' అనో అని వుంటే క్షమించగలిగేది. ఆ దేమి కాకుండా ఇన్ని అని అంకెలలో చెప్పటం శకుంతలని చాలా కష్టపెట్టింది. ప్రేమించి పెళ్ళి చేసుకున్న భార్యా భర్తల మధ్య లెక్కలు అంకెలు రావని శకుంతల ఎంతో ఇదిగా నమ్మింది. చిన్నప్పుడెప్పుడైనా శకుంతల చెప్పిన పన్చెయ్యకపోతే వాళ్ల నాన్నగారు 'ఆ పన్చేస్తావా? ఓ నాలుగు లెక్కలు చేయించమన్నావా?' అనో 'వెయ్యిదాకా అంకెలు లెక్కపెట్టించమంటావా?' అనో భయపెట్టేవారు. అందుకని శకుంతల అవి కోపాలు కావేషాలు ఉన్నప్పుడే కాని ప్రేమికుల మధ్య రావని నమ్మింది. అందుకని శకుంతల కేడుపొచ్చింది. అయినా మొగుడు కొత్త గనుక ఏడవలేదు. (శకుంతలకి కొత్త పోయి ఏడవటానికి మరో నెల పట్టింది.) కాని 'అందులో అన్నీ పాతవే. రేపోమాపో చిరిగిపోయేవే ఎక్కువ!' అని చాతనైనంత శాంతంగా జవాబిచ్చింది. దానికి శేషగిరి— 'చిన్నప్పుడు మా ఇంగ్లీషు మేష్టరు 'నెధవల్లారా! కాంపోజిషన్ ఎక్కువ పేజీలు రాస్తే ఎక్కువ తప్పులొస్తాయి. తక్కువ పేజీలు రాసేడవండి.' అనేవాడు. అల్లాగా ఎక్కువ చీరలుంటే ఎక్కువ చిరిగిపోడానికి సిద్ధంగా ఉన్న చీరలుంటాయి.' అని ఓ చిన్న థీరీ ప్రపోజ్ చేసాడు. అదే కొంప ముంచింది. శకుంతల అలకమని 'మీరేమన్నా కొన్నారా? మీకెందుకు బాధ?' అని అనేసింది. అల్లా అంటే ఎవరైతే మాత్రం ఏమనుకొంటారు? మనం కొన్న చీరలైతే మనం మాట్లాడచ్చు. మనం కొనకపోతే మనం మాట్లాడకూడదు అనుకుంటారు, అవునా? శేషగిరి అల్లాగే అనుకున్నాడు. అయితే అసలు చీరల విషయంలో ఏ భర్త ఎప్పుడూ నోరెత్తరాదన్న విషయం చాలా రోజులు తరువాత తెల్సింది ఎల్లా? ఎన్నో బొప్పిలు కట్టి.

పెళ్ళయిన నెలకి సంక్రాంతి పండుగొచ్చింది. శేషగిరి శకుంతలతో తిరుపతికి ప్రేమ యాత్ర చేసాడు. ఉగాదికి ఊటీ తీసుకెళ్ళాడు. ప్రేమ యాత్రలు వూరికే పోవుగదా! వరలక్ష్మి వ్రతం నాటికి శకుంతల పుట్టింట్లో ఉంది. పుట్టింట్లో ఉన్న శకుంతల శేషగిరికి ఉత్తరం రాసింది.

ప్రియమైన శ్రీవారికి,

వరలక్ష్మి వ్రతం శ్రీవారి శుభం కోరి చేసే వ్రతం. అందుకని అది నేను చెయ్యదల్చుకొన్నాను. అయితే నా బొజ్జలోని బుజ్జిగాడు 'నీకేమిటి మా నాన్నగారంటే ప్రేమ. మా నాన్నగారు చూడు ఈ విషయం తెలియగానే నీకో మంచి చీర పంపిస్తారు అంటున్నాడు. వాడికేం తెలుసు— మీరు మంచి చీర తీసుకుని స్వయంగా వస్తారని. మీ రాకకై ఎదురుచూస్తూ

మీ దాసి,

శకుంతల.

పి. యస్.

ఇదే పండుగకి మా అక్కయ్యలకి మా బావగార్లు మంచి చీరలు కొన్నారుట. నేను మా అక్కయ్యలకి, మీరు మీ అన్నయ్యగార్లకి లోకువ కాకుండా జాగ్రత్త పడండి!

ప్రేమతో మీ శకు!

శేషగిరిమీద ఆ ఉత్తరం పని చేసింది. అందుకని బజారంతా తిరిగి తనకి నచ్చిన పలక రంగు బెనారస్ రాకాటన్ చీర తీసుకుని రైలెక్కాడు. విశాఖపట్నం నుంచి ఎంతో ప్రేమతో రైలెక్కిన శేషగిరి ఎంతో కోపంగా విశాఖపట్నం రైలెక్కాడు రెండో జాల తరువాత. శేషగిరి ఆ చీర చూసి

# శేషగిరి...

శకుంతల ఎగిరి గంతేస్తోందని అనుకోలేదు గాని బొత్తిగా అంత నిర్లిప్తతతో తీసుకుంటుం దనుకోలేదు. పైగా శకుంతల మరో అపరాధం చేసింది. వరలక్ష్మీ వ్రతం నాడు దేవికి దీపం పెట్టి వత్తి ఎగదోస్తున్నప్పుడు వేలు కంటిన జిడ్డు నాజూకుగా చీర కొంగుకి తుడుస్తుంటే భరించలేక పోయాడు. అందుకని ఆ రాత్రి శేషగిరి ఆ ప్రసక్తి తెచ్చాడు. 'పోన్లెద్దురూ! డ్రైవాష్ చేస్తే పోతుంది. అయినా ఇదేం పట్టు పీతాంబరమా! బాధ పడకండి!' అని శకుంతల ఓదార్చబోయింది. నిజానికి యూనివర్శిటీలో లెక్చరరైన తన మొగుడు పెళ్ళయిన తొమ్మిది నెలలకిగాని కొనని అపురూపపు చీర పట్టుచీర కానందుకు ఆ పిల్ల చిన్నబుచ్చుకొంది. బాధ పడింది. అయినా ఆ బాధ దిగమింగి తను యెంతో గంభీరంగా మెలుగుతూ ఉంటే భర్త ఓ చిన్న నూనె మరక గురించి రాద్ధాంతం చెయ్యటం శకుంతలకి నచ్చలేదు. అయితే శేషగిరి దృష్టిలో శకుంతలది పెద్ద అపరాధమే. హోటలు కెళ్ళటం, సినిమాలు చూడ్డం తప్ప చీరలు కొనడం లాంటి కష్టాలు పడటం అలవాటు లేని తను బాధ్యతగా చీర కొంటే కనీసం ప్రేమించి పెళ్లాడిన శకుంతల 'అయ్యో! నా కోసం మీరెంత కష్టపడ్డారండి' అనొద్దూ? శేషగిరికి బోల్డు కోపం వచ్చింది.

* * *

మళ్ళీ వీధిలో ఏదో పెద్ద చప్పుడైతే శకుంతల పరుగెత్తుకెళ్ళి చూసింది. పోస్ట్‌మాన్ స్పాన్ వడేసాడు. 'శకూ!' అని ఏంతో ఆపేక్షగా పిలిచాడు శేషగిరి. శకుంతల 'వస్తున్నా!' అని జవాబు చెప్పి వీధి గుమ్మం దగ్గర కెళ్ళింది, పత్రికల కుర్రాడొస్తున్నాడేమో చూడ్డానికి. శేషగిరి శకుంతల ఎంత సేపటికి రాకపోయేసరికి కోపంగా 'శకుంతలా!' అని గావు కేక పెట్టాడు. శకుంతల శేషగిరి కంఠస్వరం బట్టి కంటె తన్ని అతగాడు పూర్తిపేరు పెట్టి పిలవటం బట్టి అతనికి కోపం వచ్చిందని పోల్చుకుని మేడమీదకు పరిగెత్తుకెళ్ళింది. శేషగిరి అక్కడ శేషశాయిలా పడుకున్నాడు. 'ఎందుకండీ?' అంది శకుంతల.

'ఇంతసేపు ఏం చేస్తున్నావ్?' ప్రశ్న శేషగిరి నోట్లోంచి పొగలు కక్కుతూ వచ్చింది. శేషగిరి కోపం వచ్చినప్పుడు సిగరెట్లు కాలుస్తాడు.

'బాగుంది మీ వరుస. మీ కంటే లేవు గాని, నా కింకేం పన్లు లేవా? ఇల్లా మాటిమాటికి పని అత్తగారిమీద వదిలేసి పరుగెత్తుకొస్తే ఏం బాగుంటుంది?' అంది.

'బావుండదేం పాపం! మరి మీరంతా వంటింట్లో కబుర్లేసుక్కూర్చుంటే నాకు తోచేదెలా?' చేతైతే జవాబు చెప్పమాద్దాం అన్నట్టడిగాడు.

'మీరు కూడా వంటింట్లోకి వచ్చి కూర్చోండి' అని తేల్చి పారేసింది శకుంతల.

శేషగిరి అదిరిపడ్డాడు. అతనికి వంటిళ్ళంటే భయం కాదు. కేవలం వాళ్ళ వంటిళ్ళంటే భయం. అక్కడ మూడు తరాల కోడళ్ళు కూర్చుని మడి, వంట, ఆచారం అంటూ నీళ్ళా గ్రటా పోసేస్తూ వుంటారు. మామ్మ శాంతమ్మ దేముడికి ఉద్ధరిణితోనో, మామిడి ఆకుతోనో నీళ్ళు జల్లుతూ ఉంటుంది. తన మటుక్కి తను తడిబట్ట కట్టుకుంటుంది. తల్లి పార్వతమ్మ, బియ్యాలు, కూరలు, పప్పులూ హడావిడిగా కడిగేస్తూ ఉంటుంది. శకుంతల పనిమనిషి తోమిన గిన్నెలు తొల్చి నీళ్ళు పోయడానికి వంటింట్లో బోరిస్తుంది. వాటిమీద రెండు చుక్కలు నీళ్ళు జల్లి వాటికి మడిగిన్నెలు తాహనిస్తుంది పార్వతమ్మ. ఆ హడావిడిలో శేషగిరి బతకలేదు. అందుకని ఆ నెలపో శేషగిరికి ఏమాత్రం నచ్చలేదు. శేషగిరికి తన కళ్ళు క్రౌంచ పక్షిని భస్మం చేసిన ముని కళ్ళల్లాగా తీక్షణమైనవని నమ్మకం. శకుంతల్ని భయపెట్టాలని శేషగిరి శకుంతల్ని తీక్షణంగా చూసాడు అప్పుడే శేషగిరి కళ్ళు పడకూడనిది పడింది.

అతను అహమ్మదాబాదు నుంచి తెచ్చిన చీర, శకుంతల కట్టుకున్న చీర అయిన నీలంరంగు టెరీకాటన్ చీర కొంగు మీద ముచ్చటగా మూడు, రెండు అంగుళాల సైజుకల మరకలు అయిదు దరిదాపుగా సమాంతరంగా వున్నవి కనిపించాయి. అవి జిడ్డునుంచి జనించినవి. తను ప్రాణాలకి సహితం తెగించి తెచ్చిన చీరల్లో ఒక చీర అది. శేషగిరి తగ్గిపోతున్న చేతి గాయం పోటు హెచ్చింపరది. 'శకుంతల గారూ! మీ చీర అంత పరిశుభ్రంగా వుండటానికి కారణం?' అని నిలదీసాడు. శేషగిరికి ఉధృతంగా కోపంవస్తే ఉధృతంగా మన్నిస్తాడు. శకుంతల ప్రమాదాన్ని పసిగట్టి 'నే నెల్లప్పుడు సినిమాతారల చాకళ్ళు వాడే లక్స్‌నే వాడుతాను' అంది మాట తప్పిస్తూ. శేషగిరి దానికి సమాధానంగా 'సంతోషించాం' అన్నాడు. 'ఉతికితే పోతాయిలెండి. వెధవ మరకలు' అంది అనునయంగా.

'అయ్యవార్లంగారి భార్య ఏం చేస్తోందని ఇంజినీరింగ్ కాలేజీ హాస్టల్లో అప్పారావుని సుబ్బారావు అడిగితే అప్పారావేమన్నాడో తెల్సా 'బట్టలకి నూనె మరకలు పట్టించి వుతుక్కుంటోంది' అన్నాడుట' అని శేషగిరి అంత విషాదంలోను నవ్వాడు.

'మరి అయ్యవార్లంగారేం చేస్తున్నారో నీకు తెల్సా సుబ్బారావ్!' అని అప్పారావడిగితే సుబ్బారావేమన్నాడో తెల్సా 'భార్యకి చీరకొని, హతవిధీ! నేనేల అహ్మదాబాదు పోవలయు. పోతిబో నాభార్య లిలామ నన్నేల చీర తెమ్మనవలయు. అనెనుబో నేనేల వెర్రిపడి తేవలయు...' శకుంతల ఉత్సాహం పుంజుకుని ఇంకా చెప్పబోతున్న తరుణంలో శేషగిరి ఉడుక్కుని 'సంతోషించాం' అన్నాడు. శకుంతల తుఫాన్ రావటానికి ముందువుండే వాతావరణాన్ని పసిగట్టి, తనకి క్షేమప్రదం అయిన వంటింట్లోకి తప్పుకుంది. తప్పే శకుంతలంతమాటంటుందా! తను ఆ చీరకోసం ఎంత కష్టపడ్డాడు...

* * *

శేషగిరిని అహ్మదాబాద్ కాన్ఫరెన్సులో పాల్గొనడానికి యూనివర్శిటీ వాళ్ళు ఒప్పుకున్నారు. ఆ సందర్భంలో శేషగిరి, తన భార్యతో బొంబాయి, అహ్మదాబాదులలో ప్రేమ పక్షిలా ఎగురుదామనుకున్నాడు. అయితే శకుంతలకి శేషగిరి కళ్ళల్లోకి చూస్తూ ప్రయాణాలు చెయ్యటం ఇష్టమే అయినా, రైళ్ళవాళ్ళ ఎదాన డబ్బుపోయటం ఇష్టం లేదు. శేషగిరికి యూనివర్శిటీవాళ్ళు ప్రయాణపు ఖర్చు లిస్తారు కాని తనకివ్వరు కదా! అహ్మదాబాదుకి తను అయిదేళ్ల బాబు వెళ్లాలంటే ఒకటిన్నర టిక్కెట్టు కొనాలి. ఒకటిన్నర టిక్కెట్టుకి ఫస్టు క్లాసులో అహ్మదాబాదుకి ఎంతవుతుందో

లెక్కకట్టబోయి చేతకాక మానేసి ఓ రెండు వందలైనా అవుతుందనే దృఢనిశ్చయానికి వచ్చింది. అంత డబ్బే! అసలు శకుంతల పెళ్ళయిన మొదట్లో తనని శేషగిరి తిరుపతికి ఊటీకి కాకుండా ఏ కంకటాల వారి కొట్టుకో తీసుకువెళ్తే ఎక్కువ సంతోషించేది. అదంతా గుర్తొచ్చి 'నాకు ఆ డబ్బు పెట్టి అహ్మదాబాదునుంచి ఓ మంచి పట్టుచీర తీసుకురండి' అని కోరింది శకుంతల శేషగిరిని.

'నేను వెళ్తున్నది అహ్మదాబాదుకాని ధర్మవరంకాదు అమ్మడూ' అని గుర్తు చేశాడు.

'అన్నట్టు అహ్మదాబాదుకదూ. కాలికో మిల్స్, శక్తిమిల్స్ ఇంకా చాలావున్నాయిగా అక్కడ. మంచి కాటన్ చీరలు దొరుకుతాయి. కంపెనీ దగ్గరకెళ్ళి తెచ్చుకుంటే చవగ్గా ఇస్తారని చెప్పింది మా గుజరాతీ ఫ్రెండు' అని శకుంతల అంటే శేషగిరికి చిన్నప్పుడు వాళ్ల స్నేహితులు ఐస్‌ఫ్రూట్ కంపెనీల్లో ఐస్‌ఫ్రూట్లు ఉత్తినే ఇస్తారని చెప్పడం, అది విని ఆశతో తను వెళ్తే వాళ్ళు తన్ని గేటులోపలికే రానివ్వక పోవడం గుర్తుకువచ్చి నవ్వొచ్చింది.

'నేనేదో చీరలు తెండీ అంటే నవ్వుతారేం. ఏనెప్పుడోగాని అడగనే అడగను' అని చిన్నబుచ్చుకుంది శకుంతల.

'చీరలెప్పుడూ వున్నవేగా!' అని ఆపైన 'చేయిచేయి కలపరావె హాయిహాయిగా అహ్మదాబాదుపోయి వత్తాం జోరుజోరుగా' అంటూ పాటందుకున్నాడు శేషగిరి. శకుంతల గిలగిల్లాడింది. తేరుకున్నాక

'నే నెప్పుడూ అడగటమే కనిపిస్తుంది కాని మీరు కొనడం కనిపించదు' అంటూ అనుకోకుండా దెబ్బలాటకి నాంది పల్కింది.

'క్రితం నెల రెండొందలుపెట్టి చీర కొనుక్కోలా?' ఆశ్చర్యపోయాడు శేషగిరి.

'అది పట్టుచీర కదా! కాటన్‌ది కొని విన్నాళ్ళయింది?' యుగాలైంది సుమా అని గుర్తుచేస్తూ.

'రెండు నెలల క్రితం కొనుక్కున్న చీరలమాటో?'

'అవి అత్తగారు కొన్నవి'

'మూడు నెలల క్రితం కొన్న వెంకటగిరి చీర?'

'అది మా అమ్మమ్మగారు కొన్నది.'

'ఆవిడకి డబ్బిచ్చిం దెవరో?'

'చిన్నప్పుడు సినిమాలకి ఆవిడ దగ్గర డబ్బు అప్పు చేసారేమో తీర్చారు.'

'బాగుంది. గత మూడు నెలల్లో కొన్న చీరలెన్ని? తగలేసిన డబ్బెంత?'

'చీరలు రెండు. డబ్బు రెండొందలు.'

శేషగిరి తల పట్టుకున్నాడు. శేషగిరికి ఎవరైనా లెక్కలు తప్పు చేస్తే తలకాయ నొప్పొస్తుంది. శకుంతలకి తను చేస్తేనే తల నొప్పొస్తుంది; తప్పులుకాదు; లెక్కలు. శేషగిరి శకుంతలకి లెక్కలు నేర్పటానికి ప్రయత్నించక పోలేదు. ఓ సారి శేషగిరి

మేడమీద చందమామని చూస్తూ శకుంతల ఒళ్లో తల పెట్టుకుని పడుకున్న పూట 'శకూ! నేను నీకు కొంత డబ్బిచ్చాననుకో..' అంటూ మొదలెట్టాడు. 'అనుకోడం యెందుకు? ఇస్తే సోలా!' అంది శకుంతల. ప్రోత్సాహం లేందే ఏ విద్యా వంటబట్టదని తెలిసినవాడు కనుక 'నువ్వు సరిగ్గా జవాబు చెప్తే అల్లాగే ఇస్తాను. నేను నీకిచ్చిన డబ్బులో ఎనిమిది రూపాయలు పెట్టి జీలకర్ర, సింగినాదం కొన్నావనుకో......ఆ పైన నువ్వు, మా అమ్మ రూపాయిన్నర టిక్కెట్టుకి సినిమాకి వెళ్ళటానికి మా మామ్మదగ్గర రూపాయి అప్పు చేయాల్సి వచ్చిందనుకో...నేను నీకు మొదట్లో ఇచ్చిన డబ్బెంత?' అని శేషగిరి ప్రశ్న వేశాడు. చంద్రుడు దెదురుగా శేషగిరి లెక్క లడగటం శకుంతలకి నచ్చలేదు. కాని తను సరిగ్గా జవాబు చెప్తే శేషగిరి డబ్బిస్తా ననడం ఉత్సాహం కలిగించి తనకి పది రూపాయిలుంటే సిల్కు బ్లవుజు పీస్ కొక్కోను వచ్చు అని గుర్తొచ్చి 'పది' అని జవాబు చెప్పింది. శేషగిరి ఆశ్చర్యపోయి 'ఎల్లా లెక్క కట్టావు?' అని అడిగాడు.

'ఏముంది? పదికి ఎక్కువ మిగిల్లాగూ ఉబ్బవ్వరు. అంతకంటె తక్కువ నాకెల్లాగూ సరిపోదు.'అంది శకుంతల. ఆ పైన తన జవాబు సరి అయినదే కనుక శేషగిరిదగ్గర పది రూపాయలు వసూలు చేసింది. శేషగిరి లెక్కలు నేర్పే ప్రయత్నం మళ్ళీ చెయ్యలేదు.

శేషగిరి ప్లేటు మార్చాడు. 'చూడు శకూ! గుజరాతు సాక్షాత్తు ప్రేమన్నారాయణమూర్తి అయిన కృష్ణుడు విహరించిన చోటు' అని నవ్వి చెప్పాడు. శకుంతల కొంచెం కరిగింది. అధికస్య అధికఫలం ఎప్పుడూ సత్యంకాదని శేషగిరికి అప్పట్లో తెలియక ఇంకా కరిగించటానికి 'పోన్లెద్దూ నీ కెన్ని చీరలు లేవు ఇప్పుడు నేను కొనకపోతే వచ్చిన నష్టమేమీ లేదు' అంటూ ఉత్సాహపడ్డాడు.

శకుంతల కళ్లల్లో నీళ్ళు తిరిగాయి 'శుక్రవారప్పూట నన్నేడిపించకండి. ఇంట్లో లక్ష్మి నిలవదు. కట్టుకున్న పెళ్లానికి గుమాస్తాగూడా ఆలోచించకుండా చీరలు కొంటాడు.' ఆమాటలనే సరికి శకుంతల వంటింట్లోకి వెళ్లిపోయింది.

# శేషగిరి..

ఆడవాళ్లంత చీరలు విషయంలో దొంగలు దొంగలూ చేరి వూళ్ళు పంచుకున్నట్టుగా ఒకళ్ళ విషయంలో మరోళ్ళు మద్దత్తిస్తూ వుంటారు. 'ఇంటి ఆడపడుచుకి చీరకొనకపోతే ఎల్లా? బాగుండదు' అని ప్రతీ అమ్మడూ వదినగారిమీద ప్రేమొలకపోస్తుంది. ఆ మాటలవెనక తనూ ఓ ఇంటికి ఆడపడుచునన్న స్పృహ వుంటుంది. అల్లాగే అత్తా కోడళ్లమధ్య అభిమానాలుకూడా. పార్వతమ్మ రంగంలోకి వచ్చి —'అహ్మదాబాదులో చలెక్కువని, అసలే శీతాకాలం అని, బాబుకి జలుబు చేస్తుందని, శకుంతల కొచ్చేటప్పుడు చీరలు తెమ్మని అధికార యుక్తంగా చెప్పటంతో శేషగిరి తెల్లజెండా ఊపి విడిగా రైలెక్కాడు.

శేషగిరికి బొంబాయిలో మెరీన్ డ్రైవ్ చూస్తూంటే అడ్డమైన హిందీ సినిమాలు గుర్తొచ్చి శకుంతల లేనిలోటు గుర్తొచ్చింది. అహ్మదాబాదు చలి రాత్రుళ్లు శకుంతల్ని పదేపదే గుర్తుకు తెచ్చాయి. తను పేపరు చదవటం అయిపోయిన మర్నాడు కాన్ఫరెన్సుని మిగిలిన ప్రజకొదిలేసి డెలిగేట్ల భార్యలందరూ గైడెడ్ షాపింగ్‌కి వెళ్తుంటే తనూ వెళ్లాడు. శేషగిరి అక్కడ చీరలమ్మే అమ్మాయికి క్లాసులో పాఠం చెప్పినంత విశదంగా శకుంతల రూపురేఖలు వర్ణించి వాళ్ల అమూల్యమైన సలహాల్ని పాటించి ఓ రెండు చీరలు కొన్నాడు. నిజానికి చీరల విషయంలో అంతవరకు ఏం పెద్ద కష్టపడలేదు. కష్టమేదో అని తీసుకొన్నూ రైల్లో పడ్డాడు.

హైదరాబాదులో శేషగిరి వాటాకి పాతకాలపు ఫస్టుక్లాసు పెట్టెలో ఓ బర్తు వచ్చింది. అందులోనే మరో సర్దారుడు గూడా ఎక్కాడు. ఎందాకా అంటే మీరెందాక అంటూ పలకరించుకున్నారు. సర్దారుడికి లగేజి లేకపోవటం శేషగిరికి ఆశ్చర్యం కలిగిస్తే 'బెజవాడలో ఓపూట చుట్టాలింట్లోవుండి తిరిగి రైలెక్కేకాడికి సామానెందుకని తెచ్చుకోలేదని' చెప్పాడు. రైలు కదలగానే చలేస్తోందని కిటికీలన్నీ మూసాడు సర్దారుడు. ఇంకో పావు గంటకి రైలు పక్క స్టేషన్‌లో ఆగుతుందనగా సర్దారుడు లేచి నిలబడి కత్తితీసాడు నెమ్మదిగా'పర్సిస్తావా? పొడిచెయ్యమన్నావా?'అని అడిగాడు శేషగిరిని. అందులో పెద్ద ఆలోచించటానికి ఏం కనపడలా. అందుకని పర్సులోంచి రైలు టికెట్టు తీసుకుని మిగిలిన అయిదు రూపాయల్తో సహా పర్సిచ్చేశాడు. శేషగిరికి చిన్నప్పుడు సర్దారులు బహు కోపిష్టులనీ వాళ్ళ మొలల్లో కత్తు లెప్పుడూ ఉంటాయని, వాళ్ళు మొలలోంచి కత్తి బయటికి తీస్తే ఎవర్నో ఒకర్ని పొడవందే లోపల పెట్టుకోరని, ఎవరూ దొరకకపోతే తమనే పొడిచేసుకుంటారని, అతని స్నేహితులు చెప్పడం శేషగిరి మర్చిపోలేదు. శేషగిరి సర్దారుడికి కోపం తెప్పించ దల్చుకోలేదు. అందుకని పర్సిచ్చేశాడు. అయితే ఫస్టు క్లాసులో ప్రయాణం చేసేవాడి పర్సులో వున్న డబ్బు సర్దారుడికి కోపం తెప్పించింది. ఉన్నట్లుండి రైలు పెట్టె తలుపు తెరిచాడు సర్దారుడు. ఆ పైన శేషగిరి సూటుకేసు అందుకుని రైల్లోంచి దూకేయటానికి సిద్ధపడ్డాడు. శేషగిరికి పెద్దలమాటలు వినకపోవడం వల్ల కలిగే నష్టాలర్థమయ్యాయి. శేషగిరి తండ్రి, అతన్ని దొంగలు పుచ్చుకుని దిగిపోడానికి వీల్లేని ఇనప పెట్టె తీసుకు వెళ్ళమంటుంటే వినకుండా ఫస్టు క్లాసులో దొంగలుండరని చిన్న తోలుపెట్టె తీసుకుని బయల్దేరాడు. శేషగిరికి నచ్చని విషయాలలో కూలీల్తో పేచీ లొకటి. అంతకంటే చిన్ని పెట్టె తీసుకెళ్తే తనే మోసుకోవచ్చు కదా అని తెచ్చుకున్నాడు. అందుకు అనుభవిస్తున్నాడు.

దూకబోతున్న సర్దారుడు వెనక్కితిరిగి ఓ చిన్న చిరునవ్వు నవ్వాడు. అందులో 'నీ పెళ్లానికి ఏం జవాబు చెప్తావ్?' అన్న హేళన కనిపించింది శేషగిరికి. ఆ క్షణంలో అతనికి ఆ పెట్టెలో తను శకుంతల కోసం కొన్న చీరలున్నట్టు గుర్తొచ్చి అసంకల్పిత చర్య వల్ల సర్దారుడి మీదకు దూకాడు. రైలు ప్లాట్‌ఫారంని సమీపిస్తుండటం చేత సర్దారుడు శేషగిరి చేతిమీద కత్తితో పొడిచాడు తప్పించుకపోడానికి. అసలల్లా జరుగుతుందని తెలిస్తే శేషగిరి ఆ సాహసం చెయ్యకపోను. అసలు గెడ్డం తెగుతుందని వారానికోసారి గాని శేషగిరి గడ్డం చేసుకోడానికి ధైర్యం చెయ్యడు. గడ్డం గీసుకుంటే గాని దగ్గరకు రానంటుంది శకుంతల. శేషగిరి శకుంతలని ప్రేమించిన మాట

వాస్తవమే. అయితే దానికోసం రక్తం కారేలా చీటికీ మాటికీ గడ్డం గీసుకునే అంతగా ప్రేమించ లేదు. అందుకని సర్దారుడు కత్తితో పొడవగానే సర్దారుడిని వదిలి పెద్దామా అనుకున్నాడు. అయితే అతనల్లా అనుకుంటున్న సమయంలో తెరిచి వున్న తలుపులోంచి బయటనుంచి లోపల జరుగుతున్న భాగవతం చూసిన టీ అమ్మే అబ్బాయిలు 'గ్లాసులు భద్రం' అని హెచ్చరిస్తూ అరుస్తున్నా వినిపించుకోకుండా రైల్లో కెక్కి సర్దారుడి పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. ప్రమాదం లేదని పోల్చుకోగానే పోలీసులొచ్చి సర్దారుడిని పట్టుకుపోయారు. శేషగిరికి ఫస్టెయిడ్లూ, వీరోచిత సత్కారాలు జరిపారు. అక్కడ్నుంచి శేషగిరి అవమానకరపు భాగాన్ని కత్తిరించి తన సాహసానికి మెరుగులుదిద్ది తనకథ కనీసం విశాఖపట్నం వచ్చే లోపల ఓ పదిమందికి చెప్పాడు. అందులో ప్రతి ఒకళ్లు మరోళ్లకి చెప్పారు. అందుచేత ప్రతి స్టేషన్లోను శేషగిరిని వేలెత్తి చూపించారు.

చేతికట్టుతో దిగిన శేషగిరిని చూసి శకుంతల 'ఇంకెక్కడా పొడవలేదు కదా! వాడితో మీరెందుకు కలబడ్డారండీ. వాడు చేతిమీద పొడిచాడు కనుక సరిపోయింది. మరెక్కడైనా పొడిస్తే నేనన్యాయమై పోయుండేదాన్ని. ఇంకెప్పుడూ సాహసం చెయ్యకండి' అంటూ బావురుమంది. ఆ పైన బోల్డు సేవలు చేసింది. యూనివర్సిటీ కెల్లాగో సంక్రాంతి సెలవలే కనుక శేషగిరి, ఇంట్లోనే వుండిపోయాడు. వారం అంతా. ఆ వారం అంతా శకుంతల, శేషగిరికి ఆపేక్షతో లోపం చెయ్యలేదు. కాని ఈ రోజు శుక్రవారం పత్రికెప్పుడొస్తుందో అన్న ఆత్రంతో అశ్రద్ధ చేసింది. ఏదైన వుండి, పోతే లేదా బాగా తెలుస్తుంది. శేషగిరి అశ్రద్ధ చేయబడ్డానన్న భావంతో కోపం తెచ్చుకున్నాడు.

* * *

వంటింట్లోకి వెళ్లిపోయిన శకుంతల మీద శేషగిరికి కోపం వచ్చింది' శకుంతలవెంట వంటింటి దగ్గరికి పరుగెత్తికెళ్లి శకుంతలతో దెబ్బలాట పెట్టుకుందామా అనుకున్నాడు. ఆమెకున్న స్థానబలిమి తల్చుకుని నీరుగారిపోయాడు. అందరిళ్లల్లోనూ అత్తా కోడళ్లనాక ముచ్చటగా దెబ్బలాటలు అవి వుంటాయా అదేం ఖర్మో తనయింట్లో, మూడుతరాల కోడళ్లు ఐకమత్యంగావుంటూ అభిమానం పలకబోసుకుంటూ, అన్నం వండటం అనే మిషతో రణగొణ ధ్వనులు చేసుకుంటూ, ఆ వంటిల్లు అనన్య దుర్భంగా శత్రుజన అభేద్యంగా చేసుకుని సుఖంగా వుంటున్నారు అని శేషగిరి తన ఖర్మని విసుక్కున్నాడు. ఆ పైన మేడ దిగి వీధి గుమ్మందగ్గర సిగరెట్టు కాలుస్తూ నిలబడ్డాడు.

ఆ సమయంలో పత్రికల అబ్బాయి సైకిల్కి స్టాండువేసి పత్రికిచ్చిపోయాడు. శేషగిరి పత్రికందుకుని ముందస్తుగా, అట్టలోపలి బొమ్మలు, సినిమా బొమ్మల్లో, జ్యోతిలక్ష్మి బొమ్మలు, విజయలలిత బొమ్మలు చూసేసి అలవాటు చొప్పున 'ఈవారం హత్యలు—దొంగతనాలు' వున్న పేజీ తీసి చదవటం మొదలెట్టాడు. ఆ వార్తల్లో ఒకటి ఇల్లా వుంది.

'కష్టపడి సీతకోసం బంగారపు లేడిని తెచ్చిన రాముడూ, సత్యభామకోసం పారిజాతపు చెట్టు తెచ్చిన కృష్ణుడు పుట్టిన భారతదేశం ఇప్పటికీ గొడ్డుపోలేదని నిరూపించే సంఘటనొకటి మధ్య హైదరాబాదు దగ్గర జరిగింది. హైదరాబాద్నుంచి విశాఖపట్నం వెళ్తున్న శేషగిరి అనే యూనివర్సిటీ లెక్చరరున్న ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో మరో సర్దార్జీ ఎక్కటం పెద్ద ప్రమాదకరమైన విషయంగా ఎవరికీ హైదరాబాదులో అనిపించలేదుట. అయితే పెద్దమనిషిలా రైలెక్కిన సర్దార్జీ పక్క స్టేషన్లో రైలాగబోతుండగా కత్తి చూపించి పర్సు, సూట్కేసు లాక్కున్నాడుట. అయితే పర్సు ఇచ్చేసిన శేషగిరి సూట్కేస్ ఇవ్వ నిరాకరించి సర్దార్జీ మీదకురికి ఒడుపుగా పట్టుకుని, రైలు స్టేషన్లో ఆగగానే పోలీసుల కప్పచెప్పాడుట. శేషగిరి ఇంతకూ అంత సాహసం చెయ్యటానికి కారణం ఆ సూట్కేసులో ఆయన ప్రేమగా ఆయన భార్యకి అహమ్మదాబాద్ నుంచికొని తీసుకువెళ్తున్న చీరలుండడంట. అల్లాంటి వార్తలు విన్నప్పుడు హావ్ డు వుమన్సే! షివల్రీ ఈజ్ నాట్ డెడ్ ఇన్ ఇండియా.'

ఆ వార్త శేషగిరికి వియుసనందకరంగా కనిపించింది. చీరలు కొనడంతోను, అవి కష్టపడి భార్యలకి జేర్చడంతోను వచ్చే ఖ్యాతిముందు ఆప్రెల్ కష్టాలెంత! జీవితంలో మొట్టమొదటిసారి శేషగిరికి భార్యకి చీరలు కొనడంపట్ల సదభిప్రాయం కలిగింది. కలగదు మరి! తను రాముడు కృష్ణుడు అంత గొప్పవాడని పత్రికలు రాస్తే, శేషగిరికి ఆ వుత్సాహంలో తను మూడుతరాల కోడళ్ల పొడానిడిని అవలీలగా భరించగలనని అనిపించటంతో వంటింట్లోకి వెళ్లి పత్రిక శకుంతలకిచ్చి, సీరియల్ కథ, ఆమె చదవగా విని అక్షింతలు జల్లుకుని తరించాడు. ●






**కె. కె. ఎమ్, మద్రాసు**

ఇద్దరు సినిమా నటులు కలుసుకొంటే ఎలా మాట్లాడుకొంటారు కె. రా గారూ?

నటులా? నటీమణులా?

నటులైతే— ప్రపంచ విషయాలన్నీ మాట్లాడ వచ్చు. నటీమణులా? మామూలుగా మాట్లాడు కోరు.

'ఉగాది సంచికలో నీ వ్యాసం బాగుంది. ఎవరు రాసిపెట్టారు?' అంటుందొకామె.

'— సరేకాని — అంత అర్థమయ్యేలా ఎవరు చదివిపెట్టారబ్బా?' అంటుంది రెండో ఆవిడ.

'—' అంటుంది మొదటావిడ.

**ఆర్. వి. ఆర్, కాకినాడ**

ఆం. ప్ర.లో మమ్మల్నిద్దర్నీ బాగా అర్థం చేసుకున్న వ్యక్తి ఒక్కరే ఉన్నారు—శ్రీ శ్రీ. ఆయనలాగా మేం మిమ్మల్ని అర్థం చేసుకో లేక పోతున్నాం. కారణ మేమిటంటారు.

మీరు మహాకవులు కాకపోవడమే!

**ఆర్. ఆర్; ఆర్. ఎమ్, జగిత్యాల**

ధర్మరాజుకి యిష్టమైనది ధర్మమా? జూదమా?

ఆ మెత్తని పులికి యిష్టమైనది ధర్మజూదం!

**సి. హెచ్. బి. కె, ముప్పవరం**

రామలక్ష్మిగారూ, కొందరు ఆస్తిచూసి గర్వపడతారు. కొందరు అందంచూసి గర్వ పడతారు. మరి మీరు?

బ్రతికాను! రెండూ లేవు కనుక నిశ్చింతగా సామాన్యంగా ఉన్నాను.

**ఏ. సి. డి, విజయవాడ**

మనిషిలోని ఉత్తమగుణం ఏమిటి?

మనసు తెలుసున్న వాడిని చంపాలనుకున్నా చూరు కోవడం!

**జె. కె. పి, విజయనగరం**

జీవితం ఒక ఘటనావళి. అయితే మరి స్త్రీ జీవితం సమాధానం లేని ప్రశ్నావళి?

పొరపాటు. మీ జీవితం పోటి ఘటనావళి అయితేనే మీ స్త్రీ జీవితం సమాధానంలేని ప్రశ్నా వళి. లేకుంటే రెండూ ఫలవంతమే.

**జె. ఎ. ఆర్, హైదరాబాదు**

కొందరెందుకు మాట జారుతారు?

విసరిన మాటా, విసరిన రాయీ వెనక్కి తీసు కోలేం అన్న సంగతి మరచి.

**ఎస్. పి. ఎమ్. ఆర్, కొవ్వూరు**

నాకు హృదయంలేని ప్రియురాలు దొరికింది. గుండె మార్పిడిచేసే ఈరోజుల్లో హృదయాలను మార్పిడిచేసే ఆస్పత్రి ఎక్కడను యున్నారా?

ఇస్తానుగాని, ఒక్కమాట. హృదయంలేని ప్రియురాలేనయం— గయ్యాళి కంటే. ఆలో చించుకొండి— అసలు హృదయం ఎలాంటిది దొరుకుతుందో మరి!

**ఎస్. ఆర్. ఆర్, పలాస**

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను, లౌ లెటర్ అడిగింది. ఇచ్చాను. చదువుకుని ఆనందించిందేగాని జవాబు యివ్వలేదు. సరికదా వాళ్ల అక్కయ్యలతో చెప్పి అవ మానించింది. దీనికి కారణం ఏమిటి?

మీ లౌ లెటరే అయివుంటుంది—లౌ లెటర్సు అంటే చాలా మంది అసభ్యమైన ఉత్తరాలు అను కుంటూ వుంటారు. కొంపతీసి మీరు కూడా?!

**కె. ఎస్, బోధన్**

మీరు నాటిగా నిర్భయంగా యిచ్చే జవాబులు, రాసే వ్యాసాలు నా కిష్టం. ఏక్కడుంది సభ్యత? వ్యాసం నాకు చాలా నచ్చింది...మా యింటిపక్క...

అదిగో అదే వద్దు. పొరుగువాళ్ల మీద కోపం వచ్చి కథలూ, వ్యాసాలూ రాయ కూడదు. అదీ సభ్యత కాదు!

**సుగుణ, గుడివాడ**

మా బావగారు కలియుగ ధర్మరాజులనీ, కాని మీరు వారికి చండికలాంటివారనీ స్నేహితులు అంటూవుంటారు.

నిజమే. ప్రతి కలియుగ ధర్మరాజు వెనుకా ఓ చండి లేకపోతే కుటుంబం ఎలా నడుస్తుంది సుగుణా? వారిది మెత్తని గుండె అయితే వారి మెత్తని గోళే! ఐ యామ్ హిజ్ బెట్టర్ హాఫ్!! ఆయన సంపాదిస్తారు. నేను ఖర్చు పెడతాను.

**పి. ఆర్. ఆర్, ఉండ్రాజవరం**

పేవుమెంటుమీద దరిద్రుడలా అలమ టిస్తూనే ఉన్నాడు. నిరుద్యోగి అశాంతిలో నరకయాతన అనుభవిస్తూనే వున్నాడు, ఈ చట్టాలు, సవరణలు ఊకదంపుడు ఉపన్యాసాలు కనీసం ఒక్కని కడుపైనా నింపుతున్నాయా ?

అయ్యా రామారావుగారూ, మీరొట్టి అమాయ కుల్లా వున్నారు. నిరుద్యోగుల సంఖ్యకు సరిసమా నంగా వుంటారు— మన రాజకీయవాదులు. మీ రన్నవన్నీ అందాకా వారి కడుపులు నింపు తాయి. ఛాన్సు తగిలితే వారి భోషాణాలు నింపు తాయి. వారి కది చాదా?!

**జి. ఎస్. ఆర్, పాండూరు**

ఎంతో చనువుగా మాట్లాడే స్త్రీలకు వెంటనే లోకం నిందవేస్తుంది...

పొరపాటు. చనువులో చౌకబారుతనం లేని నాడు—ఎలాటి నింద వేయడానికీ అవకాశం వుండదు ఎవరికీ.

ఎటువంటి స్త్రీలను నమ్మాలి?

ఎందుకొచ్చిన గొడవ? ఎవరినీ నమ్మవద్దు.

**ఎస్. ఎస్. ఆర్, విశాఖపట్నం**

నాటిగా మాట్లాడుతూంటే వేదాంతి అంటున్నారండీ ?

నాటిగా మాట్లాడితే నన్యాసి! అంటారు. గుంభనగా మాట్లాడితే వేదాంతి అంటారు!

**ఎస్. పి, నింజమూరు**

దేవుడు మానవులను సృష్టించలేదు. మానవుడే దేవుణ్ణి సృష్టించాడు అన్న గోరాగారి అభిప్రాయంపై మీ వ్యాఖ్య.

ఇదెప్పటినుంచి చెప్మా! అసలు గోరాకి దేవుడి మీదా మనిషి మీదా కూడా నమ్మకంలేదే ఒక్క ఆడపిల్లల మీద తప్పించి! (పొరపాటు మీరనే గోరా నిరీశ్వర వాది గోరా కాబోలు వారాముత్తాన్ని సైన్సులా పెంపొందిస్తున్నారు కదూ?)

**ఎ. వి. ఆర్. ఏ, గుంతకల్లు**

వంటరాని ఆడది. ఉద్యోగంలేని మగ వాడు పెళ్లిచేసుకుంటే వారి కాపురం ఎలా వుంటుంది ?

మూడు పూవులూ ఆరు కాయలుగావుంటుంది! ఇద్దరికీ వంట రాకపోతే యిబ్బందికాని ఏ ఒక్కరికి వచ్చినా గడిచిపోతుంది.

**సి. ఆర్. ఎమ్, మహబూబ్‌నగరు**

నా మంచితనం అర్థం చేసుకోలేని ఆమె దృష్టిలో నేనింకా ద్రోహిగానే మిగిలి పోయాను. ఆమె నిప్పుడేమి అనకుండా పెళ్లిఅయిన తరువాత ఆమె భర్తకు మేం యిరువురం కలిసివున్న ఫోటో పంపి ఆమె జీవితం సర్వనాశనం చేయాలని అనుకొం టున్నాను.

గొప్పపని చేస్తారు! తీరా ఆ భర్త సహృదయుడూ, అర్థం చేసుకునేవాడూ అయి— ఈ ఫోటో అందుకుని మీరు బ్లాక్ మెయిల్ చేస్తు న్నారని కేసు బనాయిస్తే?!




# తీయని కలలూ తీరని వెతలూ

**జయలక్ష్మి**

రెక్కలు చాచుకున్న చిన్నసైజు విమానంలావున్న నీలిరంగు పెద్దకారు మెత్తగా మృదువుగా జారిపోతోంది.

శైలజ కొద్దిగా కనురెప్పలెత్తి సాగర్ వైపు చూసింది. అతను ముందుకి చూస్తూ మరేదో ఆలోచిస్తూ డ్రైవ్ చేస్తున్నాడు.

పట్టుదలని సూచిస్తూ ఎత్తైన నాసిక చలాకీగా చురుకుగా చూసే మెరిసే కళ్ళూ నవ్వీ నవ్వనట్టుండే బలమైన పెదవులు, ఆరడుగుల ఎత్తు. ఎత్తుకి తగిన లావుతో అందంగా హుందాగావున్న సాగర్ని క్షణం సేపు సర్వం మరచి అలాగే చూస్తూ వుండి పోయింది.

అది గమనించిన సాగర్ తల తిప్పాడు. యిద్దరి చూపులూ కలుసుకున్నాయి.

శైలజ గుండెలు జల్లుమన్నాయి. చిన్నడూ ఎరుగని అనుభూతి ఏదో ఆమెని కదిలించింది. సిగ్గుపడుతూ కనురెప్పలు వాల్చేసుకుంది. అది చూసి అతను హాయిగా నవ్వాడు.

ఆసక్తిగా చదువుతున్న భవాని క్షణం పాటు చదవటం ఆపి కళ్ళు మూసుకుంది.

ఆ శైలజ ఎవరో కాదు— తనే! అనురాగాన్నంతటినీ తనలో దాచేసుకుంటూ సిగ్గుల మొగ్గలా కూర్చుంది తను. సాగర్ తనవైపే చిలిపిగా ఆప్యాయంగా చూస్తున్నాడు.

ఎంతటి అందమైన అనుభూతి!

'ఎన్నిసార్లు పిలవాలే నిన్ను? అన్నంపెట్టి పావుగంటయ్యింది. అందరూ తిని లేచి పోయారు కూడా, ఆ పుస్తకాలుంటే చాలు తిండీ తిప్పలుకూడా అవసరంలేదు. కూటికీ గుడ్డకీ పనికీరాని చదువులు' కోపంగా కూతురి చేతిలోని వారపత్రిక లాగి అవతల పడేసింది జానకమ్మ.

'అబ్బ. వస్తున్నానమ్మా' విసుక్కుంటూ పత్రిక అందుకోబోయింది భవాని.

'అన్నం తిన్నాక చదువుకోరాదమ్మా' ప్రక్కగదిలోనుండి వస్తూ మందలింపుగా అన్నారు రాజశేఖరంగారు.

మనస్సులో విసుక్కుంటూనే మరి గత్యంతరంలేక వెళ్ళి పీటమీద చతికిలబడింది.

'కాస్త నిదానంగానే తిను. అవతల రాచకార్యాలేవీ మునిగిపోవటంలేదు. ఆ పత్రికని ఎవరూ ఎత్తుకుపోరులే' గబగబా నోట్లో కుక్కుకుంటున్న కూతుర్ని కోపంగా చూస్తూ మందలించబోయింది.

'నేనెట్లా తింటే నీకెందుకమ్మా? అన్నిటికీ సాధిస్తావు?' చిరాగ్గా అనేసి సగం తిన్న కంచంలో చెయ్యి కడిగేసి లేచి పోయింది భవాని.

మనస్సంతా వారపత్రికలో తన అభిమాన రచయిత్రి వ్రాసిన కొత్త సీరియల్ మీదే వుంది. నశేషం వరకూ ఆసక్తిగా ఆదుర్దాగా ఒకసారి చదివేసి ఆ తరువాత తీరికగా ఆలోచిస్తూ మరోసారి ఆ దృశ్యాలని మనస్సులో హత్తుకుని పోయేలా నిదానంగా చదివితేనే కానీ మనస్సు కుదుట పడదు.

'వింటున్నారా మీ కూతురి మాటలు? రేపో మాపో మరో యింటికి పోతుంది. వింటుకు లెమ్మని చూస్తూ ఊరుకుంటే.

'దీని ఆగడాలు మరీ విపరీతంగా వున్నాయి: ఆ వెళ్ళేచోటునకూడా యిలాగే చిటపట లాడితే నలుగురూ నవ్వనరూ? యిట్లా పెంచిందమ్మా ఆ తల్లి అని......'

జానకమ్మ చదివే దండకం వినకూడ దని ఎంతగా చెవులు మూసుకున్నా ఆవిడ గొంతు సహజంగా పెద్దది కావటంతో ప్రతి అక్షరం పొల్లుపోకుండా వినపడుతూనే వుంది. భవాని యిదివరకటిలా ఏకాగ్రతతో సీరియల్ చదవలేకపోతోంది.

ప్రఖ్యాత చిత్రకారుడు ఆ కథకి అను గుణంగా వేసిన బొమ్మలనిచూస్తూ వుండి పోయింది.

తన అందమైన కళ్ళని మరింత పెద్దవి చేసి తదేకంగా చూస్తున్న శైలజని అపు రూపంగా సజీవంగా చిత్రీకరించాడు. ముందుకి దృష్టి సారించిన సాగర్ బల మైన భుజాలు, స్టీరింగ్ మీదవున్న చేతులు మాత్రమే కనపడుతున్నాయి.

'భవానీ, యిలా రా' తండ్రిగొంతు గంభీరంగా వినపడటంతో అయిష్టంగానే లేచి అతి జాగ్రత్తగా, నలగకుండా పత్రిక టేబులుమీదపెట్టి నెమ్మదిగా వెళ్ళింది.

'యివాళ అమ్మ ఏంకూర వండిందో పెద్దక్కని చెప్పమనక్కా చూద్దాం' హాస్యంగా అన్నాడు రవి.

'ఆవిడగారి అభిమాన రచయిత్రి వ్రాసిన కొత్త సీరియల్ చదువుతూ అన్నంకాదు సున్నం పెట్టినా మాట్లాడకుండా తినేసి వస్తుంది నాయనా' పద్మిని వేళాకోళంగా అంది.

'మీరు వెళ్ళి చదువుకోండి' విసుక్కుంటు న్నట్లుగా వున్న తండ్రి గొంతువిని ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని మారు మాట్లాడ కుండా అవతలకి వెళ్ళిపోయారు.

'చూడమ్మా. భవానీ, నీ తరువాత యిద్దరు పిల్లలున్నారు. వాళ్ళకి బుద్ధి చెప్పేలా నీ ప్రవర్తన వుండాలేకానీ నిన్ను లోకువగా చూసేలా వుండకూడదు'

కసిగా క్రింద పెదవి నొక్కిపెట్టింది. యిది చెప్పటానికా తనని డిస్టర్బ్ చేసింది!

'చదువుకోమంటే నా కిష్టం లేదన్నావు. పెళ్ళి చేస్తామంటే వచ్చిన సంబంధాలేమీ నీకు నచ్చటం లేదు. నీ మనస్సులోవున్న మాటేదో సూటిగా చెప్పు'

భవాని మాట్లాడలేదు. సన్నగా అం దంగా వున్న మెరుస్తున్న తన పొడుగాటి గోళ్ళని చూసుకుంటూ తలవంచుకుంది.

# తీయని కలలూ...

'అలా మూగనోము పడితే ఎలాగమ్మా? మొన్న చూసి వెళ్ళిన కుర్రాడు అన్నివిధాల బావున్నాడు. పిల్ల నచ్చిందని కబురుచేసారు. త్వరలోనే ముహూర్తం పెట్టించేద్దాం అను కుంటున్నాం.'

అంతా నిర్ణయం అయిపోయినట్టు మాట్లాడుతున్న తండ్రిని రోషంగా చూసింది. 'నా యిష్టాయిష్టాలు మీకు అవసరంలేదా నాన్నా?'

'ఏం? నీకెందుకు యిష్టంలేకపోవాలి? అతనికి ఎక్కడయినా వంకవుందా? యిది వరకంతా వచ్చిన వాళ్ళు నీకు నచ్చలేదేమో పోనీ లెమ్మని సరిపెట్టుకున్నాం. ఈ అబ్బా యికి అందం వుంది. కాస్తో కూస్తో ఆస్తి వుంది. చదువుంది. గవర్నమెంటు ఉద్యోగం వుంది. యింకేంకావాలి?' చేతిలో పని వదలిపెట్టి వంటింట్లోనుండి వచ్చింది జానకమ్మ.

'ఆఁ. గవర్నమెంటు ఉద్యోగం' గుమస్తా గిరికూడా గొప్ప ఉద్యోగమే' వెక్కిరింతగా అంది భవాని.

కూతురి ముఖంలోకి పరిశీలనగా చూసారు రాజశేఖరంగారు.

'గుమస్తా కాక కలెక్టరు వస్తాడనుకుం టున్నావా మన తాహతుకి, మనం యిచ్చే కట్నానికి?' కూతురి అమాయకత్వానికి మూర్ఖత్వానికి విస్తుపోతూ కోపంగా అడి గింది జానకమ్మ.

'కలెక్టరే వస్తాడో కోటీశ్వరుడే వస్తాడో నీకేం తెలుసు?' మనస్సులో గొణుక్కుంది.

'అంటే కేవలం అతను గుమస్తా అవనే నీ అభ్యంతరం?' సూటిగా చూస్తూ అడి గారు రాజశేఖరంగారు. 'మొదట నేనూ గుమస్తాగానే చేరాను. అవకాశం అదృష్టం కలిసి వస్తే అతనూ ఆఫీసరవుతాడు. యింతవరకూవచ్చిన అన్ని సంబంధాలలోనూ యిది చాలా బావుంది. నువ్వు నిదానంగా ఆలోచించు. అనుభవం లేని నువ్వు కథలూ, సినిమాలు చూసి ఏవేవో ఊహిం చుకోవచ్చు. కట్నం రాలనిదే ఎన్ని ఉపన్యాసా లిచ్చినా ఆశయాలువెల్లడించినా ఎవడూ తాళి కట్టడు. మన తాహతుకి యింతకి మించిన సంబంధంరాదు. మంచి సంబంధం అనే దృష్టితో మొదట అనుకున్న దానికంటే యింకా రెండువేలు ఎక్కువ పెడుతున్నాం.'

భవాని అసహనంగా కుర్చీలో కూర్చుంది. రాత్రి అంతా హితబోధచేసి తనచేత 'ఊ' అనిపించాలని కాబోలు వీళ్ళ తాపత్రయం; ప్రపంచం తలక్రిందులయినా సరే తన నిర్ణ యం మారేదిలేదు.

వాళ్ళ గుదిబండ దించుకోవాలని, పెళ్ళి చేసి తనని యింటికి పంపిస్తే బాధ్యత తీరిపోతుందని అనుకుంటున్నారే కానీ నూరేళ్ళ జీవితం అనుభవించవలసిన తను యిప్పుడు అతని అందానికి ప్రలోభపడితే ఆ తరువాత జీవితం అంతా చాలీ చాలని జీతంతో ఆర్థికంగా యిబ్బందులు పడుతూ అసంతృప్తిగా బ్రతకాలి.

అతను అందంగా లేడని అనలేదు కానీ తను కలలు కనే హీరోలా ఆరడుగులపొడవు లేడు. ఆడవాళ్ల ముఖంలా సుకుమారంగా వున్నాడేకానీ అతనిలో గాంభీర్యం, చురుకు తనం లేవు. ఎంతో మెత్తనివాడిలా అమాయ కంగా కనిపించాడు. తనని శాసించేలా వుండాలేకానీ అడుగులకి మడుగులు ఒత్తే వాడయితే భర్తంటే గౌరవం ఏముంటుంది?

## ఏడుకొండలాడికి మొక్కు

ఎంకటేశా
ఎంకటారమణా
ఎంతకష్టంబైన
ఎదురించినిల్చు
ఎక్కెద కొండన్నై
ఎకశక్య లెంచ
ఎదురీత వచ్చు
ఎవరుసెప్పిన
ఎందరుకొట్టిన
ఎండలోనుండు
ఎండిపోవను
ఎదలో ఉండు
ఎగిరిపడను
ఎరుగరునన్ను
ఎంగిలి తినను
ఎండు కొంతి నోళ్ళ
ఎంత ఘాటో ఎరుగుదువన్న
ఎట్లోర్చునో
ఎరిగి సెప్పు
సంరక్షించవా సరస్వతీగిరిన్ సంకటేశా.

—శ్రీమతి సరస్వతీగిరి

'పరిస్థితులతో రాజీపడటం నేర్చుకో వాలమ్మా. ఎప్పుడూ యింకా ఏదేదో కావాలనే ఆశ పీడిస్తూనే వుంటుంది. నీకు ఏ డాక్టరునో ఆఫీసరునో చేసుకోవాలని వున్నా అన్ని వేలు పోయగల స్తోమత నాకు లేదు. రేపే వాళ్ళకి కబురు చేస్తాను' తన నిర్ణయం స్పష్టంగా చెప్పేసి వెళ్ళిపోయారాయన.

భవాని మాట్లాడకుండా తన మంచంమీద పడుకుంది. జాలిగా తనని చూస్తున్న చుక్కలనీ, సానుభూతి కురి పిస్తున్నట్టు మౌనంగా నిలబడిపోయిన చెట్లనీ చూస్తూ ఆలోచనలలో పడింది.

చిన్నతనం నుండీ తన చెయ్యి చూసిన ప్రతి జ్యోతిష్కుడూ తనో లక్షాధికారి యింటి కోడలవుతుందనే చెప్పారు. చిలక జోస్యం, సోదమ్మ అంతా తనది గొప్ప జాతకమని, అదృష్టవంతురాలనీ చెప్పారు.

తనకు డబ్బు లేకపోవచ్చు కానీ అందం వుంది. అందమైన వయస్సు వుంది. ఎన్ని కథలలో తను చదవటంలేదు? ఎన్ని సిని మాలలో చూడటంలేదు? తిండానికి కూడా సరిగ్గా లేని యింటి ఆడపడుచలని బాగా చదువూ డబ్బూ సంస్కారం వున్న యువకులు కావాలనీ వెంటపడి ఆ అమ్మా యిని వప్పించి మరీ చేసుకోవటంలేదూ?

ఏవో కథలవరకూ పోవటం దేనికి? కాంతాన్ని వాళ్ళ బంధువుల పెళ్ళిలో చూసి కానీ కట్నం అడగకుండా పెళ్ళి చేసుకుని మరో ఏడాదిలో ఎలక్షన్లో ఫారెన్ తీసుకుని

# ప్రియుని కలలూ...

వెళ్ళలేదూ అతను?

కాంతం తనకంటే అందంగా వుంటుందా?

ఫారెన్ వెళ్ళకపోతేమానీ లక్షలూ కోట్లూ లేకపోతే పోనీ కనీసం ఆర్థికంగా యిబ్బందులు పడకుండా వుండేలా ఆస్తి, వెంటపడేటంత కోరదగిన యోగ్యత వుండాలి తన భర్తకి.

ఊహ వచ్చినప్పటినుండీ కథలూ నవలలూ చదువుతోంది. చాలా ఖర్చయిపోతోందని నాన్నగారు వారించబోయినా, అమ్మ కోప్ప డినా పట్టుపట్టి తెలుగులో వచ్చే వార మాస పత్రికలన్నీ తెప్పించి ఒక అక్షరం పొల్లుపోకుండా చదువుతోంది.

భార్యాభర్తలమధ్య మనస్పర్థలు, చాలీ చాలని జీతాలతో బాధ్యతల బరువులతో, అసంతృప్తిగా బరువుగా బ్రతుకులని ఈడ్చుకుని వస్తున్న మధ్యతరగతి సంసారాల గురించి ఎంతో సహజంగా యధాతథంగా వ్రాసారు కొందరు రచయితలు, రచయిత్రులు.

అటువంటి కథలూ నవలలూ చదువు తున్నంతసేపూ మనస్సంతా అదోలా అయి పోతుంది. యిన్ని సమస్యల తోరణమా జీవితం? అని భయం వేస్తుంది.

మరికొందరి రచనలు చదువుతున్నంత సేపూ మనస్సు ఊహాలోకాల్లో విహరిస్తూ వుంటుంది ఎన్నో బాధలనయినా తాత్కా

లికంగా మరచిపోయి ఆ పాత్రలలో కథలో లీనమైపోతుంది మనస్సు.

యింట్లో బియ్యం, పంచదారవంటి అత్యవసరవస్తువులు లేక వంటచేయటం ఎలాగో అని మథనపడుతున్న యిల్లాలు అటువంటి నవల చదవటం మొదలుపెట్టిందంటే పూర్తిచేసేవరకూ తన దిగుళ్ళని పూర్తిగా మరచిపోతుంది. పాత్రధారిణుల కలలో తేలిపోతుంది మనస్సు.

సంసారం గడవక ఉద్యోగంలో చేరిన అమ్మాయిని తొలి చూపులోనే ప్రేమి స్తాడు, యింకా పెళ్ళికాని అందమైన ఆఫీసరు లేక యజమాని. కాని అబ్బాయి తొందరపడి తన ప్రేమని వెల్లడించడు. కొంత కాలమయ్యాక ఒక శుభ ముహూర్తాన తన హృదయం విప్పి ఆమె ముందు పరుస్తాడు. కానీ ఆ అమ్మాయికి అందంతోపాటు బోలెడు అభిమానంకూడా వుంటుంది. తన బాధ్యతలని తలుచుకుని 'నో' అంటుంది. 'నీ వాళ్ళు నావాళ్ళు కారా' అని డైలాగులు చెప్పి వప్పించబోతాడు. నాలుగువారాల సీరియలు నడిచేవరకూ అమ్మాయి వప్పుకోదు. చివరికి అతనిలోని నిజాయితీని, గాఢమైన అనురాగాన్ని గ్రహించి సరే అనబోయేంతలో ఏవో అపా ర్థాలూ అనుమానాలూ. షరా మామూలే! మధ్యలో విలనులా కనిపించకపోయినా అటు వంటిపాత్రలు—బోలెడు సస్పెన్స్. చివరికి ప్రియుని విరహం. గుండెలుకోసే బాధ, బోలెడు కథ అయినాక అమ్మాయి విప్పారి కోచంగా అబ్బాయి చాపిన చేతుల్లో వాలి పోయి కౌగిలిలో కరిగిపోవటంతో పదిహేను వారాలు పాఠకుల మనస్సులు తేలికయ్యి హాయిగా తేలి కగా నిట్టూరుస్తారు. అంతవరకూ ఊపిరి కూడా తిరుబడిగా తీసుకోవాలనిపించదు. అన్నం తిన్నా రుచించదు. మరో ధ్యాస వుండదు. కథ మధ్యలో ఏ అవాంతరం వచ్చినా ఎవరయినా పలకరించినా ఖూనీ చేయాలన్నంత కోపం వస్తుంది.

'దాని మనస్సేమిటో అంతుపట్టకుండా వుంది. ఏవరినయినా మనస్సులో వుంచు కుని తపిస్తోందేమో నెమ్మదిగా బుజ్జ గించి కనుక్కోరాదూ?' ప్రక్కగదిలోనుండి తండ్రి కంఠస్వరం నెమ్మదిగా వినపడి ఉలిక్కిపడింది.

'ఆ పిచ్చివేషాలు మన యింటా బయటా



లేవు. లేనిపోనివి తెచ్చిపెట్టకండి. కొంప దీసి అది ఏ కులంవాడినో ప్రేమించానంటే చేస్తారేమిటి? యిప్పటికే చనువిచ్చి నెత్తి నెక్కించుకున్నాం. చాలు' తల్లి విసుక్కోవటం విని కోపంగా మూతి ముడుచుకుంది.

అమ్మ ఎప్పుడూ యింతే! పెళ్ళి చేసి ఎప్పుడు యింట్లోనుండి తరిమివేద్దామా అని చూస్తుంది. తను ఛస్తే ఈ పెళ్ళికి అంగీకరించదు. అంతగా అవసరం అయితే అవివాహితగానయినా వుండిపోతుందే కానీ కలలూ కోరికలు చంపుకుని ఎవరో ఒకరిని వివాహం చేసుకోదు.

తన నిర్ణయానికి తిరుగులేదు. అంతే!

ఆ రాత్రి చాలాసేపటివరకూ నిద్రపోలేదు భవాని.

* * *

'నా కిష్టంలేని పెళ్ళిచేసి నా గొంతు కోయాలని చూస్తున్నారు మీరు. అంత బలవంతంగా చేసారంటే చివరికి నా శవాన్ని చూస్తారు' శపథం చేస్తున్నట్లు అంటున్న కూతుర్ని చూసి మొదట నివ్వెరబోయి ఆ తరువాత తిట్టి బ్రతిమాలి శతవిధాల ప్రయత్నించి చివరికి విసుగెత్తి 'నీ మూర్ఖత్వానికి నువ్వే బాధపడతావు చివరికి' అని కోప్పడి ఆ సంబంధం విరమించుకున్నారు.

భవాని బాగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చింది. తన భవిష్యత్తుకి బంగారుబాట తనే వేసుకోవాలి. అవసరమైతే తన కాళ్ళ మీద తానే నిలబడకలగాలి. అందుకు నాందిగా టైప్ నేర్చుకుంటానని చెప్పిననాడు జానకమ్మ యింకా కూతురికి పెళ్ళికాదేమోనన్న భయంతో గొడవచేసి బాధపడింది ఊరికే కూర్చునే బదులు అదే నయమని సరేనన్నారు రాజశేఖరంగారు.

టైప్ మిషన్‌మీద అందంగా చురుకుగా కదిలే సుకుమారమైన వేళ్ళని చూసుకుంటూ మురిసిపోయేది భవాని. ఏదో నవలలో కథానాయికి తెల్లటి పొడుగాటివేళ్ళని, వాటి నాజూకుతనాన్ని తొలిగా చూస్తాడు. కథానాయకుడు ఆ తరువాతే ఆమె ముఖాన్ని చూసి ప్రేమిస్తాడు.

ప్రతిరోజూ పదకొండుగంటలకి యిన్‌స్టిట్యూటుకి వెళ్లే సమయానికి అందమైన పెద్దకారులో తెల్లటి యూనిఫారమ్‌లో వున్న డ్రైవర్ను వెనుక

సీటులో ఒక్కపక్కగా కూర్చుని ఒక యువకుడు కనిపించేవాడు. తన ప్రక్కగా మెత్తగా జారిపోతున్న ఆ కారునీ, అతన్నీ చూడటం. అతని అలవాట్లేమిటో, అంత పొడుగాటి కారున్న అతను ఎంత పెద్ద భవంతిలో వుంటాడో ఆలోచిస్తూ వుండగానే రోజులు వారాలు దొర్లి పోయాయి.

ప్రతిరోజూ ఒకే సమయానికి ఒక్క నిముషం అటూ యిటూ కాకుండా వెళ్ళేవాడతను. అందుకే ఎంత అవసరం వచ్చినా సరే క్షణం వ్యర్థంకాకుండా ఆ సమయానికే బయలుదేరేది, ప్రతినిత్యం కనపడటంతో అతనూ యధాలాపంగా చూసేవాడు. ఆ చూపులో తన చూపులు కలవగానే చటుక్కున కళ్ళు వాల్చేసుకుని సిగ్గుపడిపోయేది. 'గుండె జల్లుమన్నదీ' అని పాడుకోవాలనిపించేది. ఏవేవో అందమైన కలలు. తీయని ఊహలు.

ప్రేమకథలని ఒకటికి రెండుసార్లు చదివి చదివి అదే ధోరణిలో ఆలోచించటానికి అలవాటుపడిన మనస్సు అతని చుట్టూ ఏవేవో ఊహలల్లేది. ఒకసారి అతను తననిచూసి నవ్వినట్టనిపించి ఆరాత్రి అంతా నిద్రపోలేదు. మరురోజు తనూ సమాధానంగా నవ్వాలని రోజుకంటే మరోగంట ఎక్కువసేపు శ్రద్ధగా అలంకరించుకుంది.

ఎదురుగా కారు మలుపు తిరగటం చూసిన భవాని గుండెలు అతివేగంగా స్పందించాయి. కారు దగ్గరగా వస్తున్న కొద్దీ అడుగులు తడబడ్డాయి. కారు వేగం తగ్గింది. హృదయం ఆగిపోయినట్లనిపించింది. కారు ఆపి పలకరిస్తే అలా కాఫీ తాగివద్దామని ఆహ్వానిస్తే వెళ్ళటమా మానటమా అని గబగబా ఆలోచిస్తోంది.

అంతలోనే ప్రక్కగా మెత్తగా జారిపోయింది కారు. రోజూలానే ఆ రోజు యధాలాపంగా చూసాడతను, కానీ—అతను రోజూలా ఒంటరిగా లేడు. తెల్లని పాలరాతి బొమ్మలావున్న యువతి మరింత అందంగా అలంకరించుకుని మృదువుగా నవ్వుతూ అతనితో ఏవో ఖబుర్లు చెబుతోంది. ముందుసీట్లో డ్రైవరు ప్రక్కన బొద్దుగా తెల్లటి బొచ్చుకుక్క ఠీవిగా నిలబడి వచ్చేపోయే కార్లని చూస్తోంది.

# తీయని కలలూ...

భవానికి గుండె ఆగిపోయినట్లనిపించింది. తన ఆశలన్నిటిని సజీవంగా ఎవరో కాల్చేసినట్లనిపించింది.

ఆ రోజన్నీ తప్పులే కొట్టింది. పరీక్షలు దగ్గర్లో పడ్డాయి, యింకా యిన్ని తప్పులు పడితే ఎలాగని మాస్టారు కోప్పడ్డారు. ఆపూట అన్నం తినలేదు. ఎవరయినా పలకరిస్తే కసిరికొట్టి అందరిచేతా చివాట్లు తింది.

మరో ఏడాది గడిచింది.

రెండుసార్లు టైప్ లోయర్ పరిక్ష తప్పింది. యిదివరకటిలా సంబంధాలు ఎక్కువగా రావటంలేదు. ఆ వచ్చిన ఒకటీ అరా—కట్నం చాలలేదని, పిల్ల మరీ పొడుగయ్యిందనీ వయసుతేడా చాలదనో వెళ్ళిపోతున్నారు.

పద్మిని బి. ఏ. ప్యాసయ్యింది. యిప్పుడు పెళ్ళిళ్ళ పేరయ్య ఆ పిల్లకి చాలా సంబంధాలు తెస్తున్నాడు. ఈ కాలంలో ఎవరికి కుదిరితే వాళ్ళకే ముందు చేయాలని పెద్ద పిల్లకోసం కాలయాపనచేస్తే ఈ లోపల వీళ్ళు జారుకుంటారని తొందరచేస్తూ హితబోధ చేస్తున్నాడు.

పద్మిని చదివిన కాలేజీలో కొత్తగాచేరిన లెక్చరర్ తనకి ఆ అమ్మాయి నచ్చిందని, పెళ్ళిచేసుకుంటానని కబురుచేసాడు. తను కన్న కలలు తనని అపహసిస్తూ, అమ్మానాన్నా చూసిన వరుణ్ణి ఎవరు, ఏం చదివాడనయినా అడగకుండా చేసుకుంటానని




కబుర్లు చెప్పే చెల్లెలి విషయంలో నిజం కావటంతో భవాని అసూయపడకుండా వుండలేకపోయింది.

ఇద్దరి పెళ్ళిళ్ళు ఒకేసారి చేసితీరాలన్న పట్టుదలతో చాలా గట్టిగా ప్రయత్నించి శంకరయ్యని పెళ్ళిచూపులకి తీసుకు వచ్చారు. మాటవరుసకయినా తనని అడగకుండా తాంబూలాలు పుచ్చుకున్నారు. యిది వరకటిలా గట్టిగా ప్రతిఘటించలేకపోయింది. ఆ కలలు కరిగిపోలేదు కానీ తీరతాయన్న ఆశపోయింది. యింట్లో చుట్టుపక్కల బంధువులందరి దృష్టిలో చులకనైపోయింది.

చదవకుండా, ఉద్యోగంచేయకుండా పెళ్ళి చేసుకోకుండా ఏంచేస్తావు? అని పరిచయం వున్న వాళ్ళంతా సవాలక్ష ప్రశ్నలు, హితబోధలు.

యిన్ని కలలుకని అందులో ఏ ఒక్కటీ నెరవేరదని తెలిసి పెళ్ళిచేసుకోవటం తన కిష్టంలేదు కానీ చేసుకోక తప్పదు. బలవంతంగానయినా తీసికెళ్ళి పీటల మీద కూర్చోబెట్టి ఆ మూడుముడులూ వేయించేస్తారు.

ఎంతో ఆనందంగా ఉత్సాహంగా ఆ శుభముహూర్తం కోసం ఎదురు చూస్తున్న చెల్లాయిని అసూయగా చూస్తూ బలిపీఠానికి సిద్ధమైంది.

కానీ—తను కోరుకున్న జీవితం కాదిది. సాయంకాలం కాగానే షికారు కెళ్ళాలని, సరదాగా వారానికో రెండు సినిమాలయినా, చూడాలని, అందమైన ఖరీదయిన చీరలు కొనుక్కోవాలని, ఒకరినొకరు నిర్మలంగా గాఢంగా ప్రేమించుకుంటూ కలతలు లేకుండా అన్యోన్యంగా వుండాలనే కోరికలేవీ నిజం కాలేదు.

నెలకి ఒక సినిమాకయినా తీసుకుని వెళ్ళమని పోరినా అతను వినిపించుకోడు. ఒకటో అరో పుట్టింటివాళ్ళు పెట్టిన చీరలున్నాయి యింకా ఎందుకు? ఎక్కడికి వెళతావు? అంటూ తప్పించుకుంటాడు. సాయంకాలం ఏనాడూ వేళకి యింటికి రాడు. పేకాడి, సిగరెట్లుతాగి డబ్బూ, ఆరోగ్యం తగలేస్తూ ఏ అర్ధరాత్రో యింటికి చేరతాడు. మర్నాడు ఉదయం ఏ తొమ్మిదింటికో లేచి ఆదరాబాదరగా ముఖం కడుక్కుని యిష్టమైతే స్నానం

చేసి లేకపోతే అట్లాగే రెండు మెతుకులు కొరికి ఆఫీసుకి పరిగెడతాడు. ఫస్టుతారీకున జీతం అంతా తెచ్చి తన చేతుల్లో పెట్టి 'నువ్వే వాడు, అంటాడేమోనని ఆశపడేది మొదట్లో. అలా అనకపోగా యింట్లో వుండేదానివి నీకెందుకు డబ్బులు అని విసుక్కుంటూ ఏ రూపాయో అర్ధో చేతుల్లో పెట్టేవాడు.

పద్మనికి ఏడాది తిరగకుండా ఏడ్వర్ టైజ్‌మెంటు బొమ్మలా బొద్దుగా ముద్దుగా వుండే పాపాయి పుట్టింది. వాళ్ళ దాంపత్యం ఎంతో అన్యోన్యంగా ఆదర్శ వంతంగా వుంది.

వుండుకి కారం చల్లినట్టు తను చేసు కోనని మొండికెత్తిన అందమైన అబ్బాయి పొరుగున ముచ్చటగా యిద్దరు పిల్లలతో చలాకీ అయిన భార్యతో కాపురం వుంటు న్నాడు. సాయంకాలం పూట భార్యనీ పిల్ల లనీ స్కూటరుమీద షికారుకో సినిమాకో బంధువులింటికో తీసుకుని వెళుతూ వుంటాడు. కిటికీలోనుండి దిగులుగా వాళ్ళని చూస్తూ నిలబడటం తనవంతు.

ఆలోచనలతో అలసిపోయి చిరాకుగా గడి యారం తీసి చూసింది. అది తొమ్మిది అంకెదగ్గర ఆగిపోయింది!

శంకరయ్య వచ్చేజాడ ఎక్కడా కని పించటం లేదు. ఆకలివేస్తున్నా చల్లగా అతిపోయిన అన్నం ఒక్కతీ కూర్చుని తినా లనిపించలేదు.

లేచి మంచినీళ్ళు గ్లాసెడు తాగి ప్రక్కింటావిడ నడిగి తెచ్చుకున్న పత్రిక అందు కుంది.

ముంగురులని సవరిస్తూ చటుక్కున ముందుకి వంగి కనురెప్పలమీద ముద్దు పెట్టుకున్నాడు సాగర్.

శైలజ అలవోకగా తెచ్చిపెట్టుకున్న కోపంతో చూడబోయి చేతకాక సిగ్గుపడి పోయింది. అది చూసి చిలిపిగా నవ్వుతూ శైలని తన కౌగిలిలోకి లాక్కుంటూ ఆర్తిగా పెదవులమీద ముద్దెట్టుకున్నాడు.

'జన్మజన్మలకీ మనం యిలాగే వుండి పోవాలి...వుండిపోతాం కదూ' అన్నాడు మృదువుగా.

—చదువుతున్న పుస్తకం విసిరికొట్టి దిండులో ముఖం దాచుకుంది భవాని, కళ్ళ వెంట నీళ్ళు టోటబోటా కారి పోయాయి. ●

# పిల్లలు-ఆరోగ్యము



## తెలుసుకోతగిన కొన్ని ముఖ్య విషయాలు

డాక్టర్ కె వెంకటేశ్వర రావు

పిల్లలకి మిల్క్ ఆఫ్ మెగ్నీషియా గాని, ఆముదంగానీ ప్రతిరోజూ యివ్వటం మంచిది కాదు. కొందరు తల్లులు పిల్లలు ఏడవగానే పాలపీక నోట్లో పెట్టి తమ పనిలో మునిగి పోతారు. అలా చేయడం వల్ల గాలి కడుపు లోకి పోయి పిల్లలకి కడుపు ఉబ్బరం, విరోచ నాలు అవటం జరుగుతుంది.

ప్లాస్టిక్ పాలసీసాలని, ఇతర సీసాలని పాలు పట్టడానికి ఉపయోగించకూడదు. ఒకవైపు మూతి ఉన్నటు వంటివి, పడవలాంటి ఆకారం గల గాజు పాల సీసాలనే ఉపయో గించాలి.

పిల్లలకి పుట్టగానే కొంతమంది బొడ్డు లోనూ, చెవుల్లోనూ నూనె వేస్తుంటారు. సరిగా కాచని నూనె వెయ్యడం వల్ల సూక్ష్మ క్రిములు చేరి చీము పట్టడం తప్ప నూనె వెయ్యడం వల్ల ప్రయోజనం ఏమీ లేదు.

సరిగా తెలియని, వైద్యుడు నిర్ణయించని మందులని ఎవరికి వారే పిల్లలకి వాడకూడదు. ఇలా వాడటం వల్ల అనేక యిబ్బందులు కలగటానికి అవకాశం ఉంది.

పిల్లలు పుట్టిన వెంటనే తల గుండ్రంగా రావడానికి కొంతమంది మంత్రసానులు, తదితరులు వారి తలని నొక్కడం యిప్పటికీ అక్కడక్కడ జరుగుతూ ఉంటుంది. అలా చేయడం వల్ల అనేక ప్రమాదాలు, చిక్కులు ఏర్పడడానికి అవకాశం ఉంది.

పిల్లల ఆహారంలో ప్రతిరోజూ పప్పు పదా ర్థాలు ఉండేటట్లు చూడటం చాలాముఖ్యం. వేయించిన శనగపప్పు పిల్లలకి మంచి శక్తి నిస్తుంది. కడుపు నెప్పి వస్తుందని కొందరు భయపడ్తారు కానీ దీన్ని పొడిచేసి కొంచెం బెల్లం అందులో వేసి పరమాన్నంలాగా కాచి పిల్లలకి యిస్తే వాళ్ళు యిష్టంగా దాన్ని తినటమేగాక బాగా పెరుగుతారు కూడా.

రాగులు బాగా కడిగి, ఎండపెట్టి పిండి విసిరి జావలా కాచి తీపి కోసం బెల్లం లేక పంచదారని అందులో కలిపి పిల్లలకి రోజూ యిస్తే కాల్షియం ఇంకా యితర ముఖ్య ఖనిజములు పిల్లలకి లభ్యమవుతాయి.

పళ్ళు బాగా పెరగటానికి మాంసకృత్తులు, సి. డి విటమినులు, కాల్షియం క్రమంగా శరీరానికి అందుతూ ఉండాలి. అవి లోపించి నప్పుడు పలువరుస క్రమం తప్పడం, పెరుగు దల సరిగా లేక పోవడం జరుగుతుంది.

ఐస్ క్రీములు, చాక్లెట్లు, తీపి పదార్థాలు పిల్లలకి ఎక్కువగా పెడితే పళ్ళు పుచ్చిపోయే ప్రమాదం ఉంది. తీపి పదార్థాలు తిన్న వెంటనే నోటిని నీళ్ళతో పుక్కిలించి శుభ్రం చేయడం మంచిది. గోళ్ళు కొరుక్కోడం, నోట్లో వేళ్ళు పెట్టుకోడం వల్ల, నాలిక బయటికి చాపుతూ ఉండటం వల్ల పళ్ళు ముందుకు వచ్చి వికృతంగా కన్పిస్తాయి. అలాంటి అలవాట్ల నుంచి పిల్లల్ని తప్పించాలి. ముందుకి వచ్చిన పళ్ళకి క్లిప్ వేయిస్తే సరిగా వస్తాయి.

గరుగ్గా ఉండే పళ్ళపొడులతో పిల్లలకి పళ్ళు తోమకూడదు. వాటివల్ల పంటిపై నుండే ఎనామిల్‌పూత అరిగిపోతుంది. మెత్తటి పొడులని లేక పేస్టునే పళ్ళు తోమడానికి ఉపయోగించాలి.

పిల్లలకి నక్కపొడి, తాంబూలం అలవాటు చేయడం మంచిదికాదు. వాటి వల్ల పళ్ళకి హాని జరుగుతుంది. కొంతమంది పిల్లలకి రెండు మూడు వరుసలుగా పళ్ళు వస్తాయి. అలాంటప్పుడు వారిని దంతవైద్యుని వద్దకి తీసికెళ్ళి చికిత్స చేయించాలి. ప్రతి ఆరు నెల్లకొకసారి దంత వైద్యునిచేత పళ్ళు పరీక్ష చేయిస్తే దంత వ్యాధులు దరి చేరవు.




బలివాడ కాంతారావు

### జరిగిన కథ

ఒక వ్యక్తిమీద అనేక అభిప్రాయాలు వున్నట్టే — ఆ ఆస్పత్రిమీద కూడా అనేకానేక మంచీ — చెడూ అభిప్రాయాలున్నాయి. సూర్యానికి ఆ ఆసుపత్రి అంటే ఒకరకమైన భయం. తీరా అతను కూడా అందులోనే చేరాల్సి వచ్చింది. ఆ వార్డులో ఇంకా శెట్టిగారు, శ్రీనివాసు వున్నారు. ఆసుపత్రిలో చేరాక సూర్యానికి గతమంతా కళ్ళముందు కదలింది. అతను యవ్వనంలో ప్రవేశించగానే మొట్టమొదటిసారిగా విశాలాక్షి మీదకి మనసు పోయింది. సూర్యం చెల్లెలు గౌరి. ఆమె జ్ఞాపకం రాగానే అతని కళ్ళలో నీళ్ళు నిండాయి. గౌరి భర్త గోవిందరావు ముక్కుసూటిగా ప్రవర్తించేవాడు. అతనితో ఎప్పుడూ గొడవే. గోవిందరావు అకస్మాత్తుగా హాస్పిటల్లో మరణించాడు. ఆఫీసరుగా ప్రమోషన్ రావడం సూర్యం జీవితంలో ఒక పెద్దమలుపు. అంతా అతన్ని ప్రశంసించినవారే. బొంబాయిలో గీతతో పరిచయం అయింది. గీత అతన్ని ఎప్పుడూ ఆడిస్తూ వుండేది. నితన్ని పెళ్ళిచేసుకోవాలని గీతకి వున్నా సూర్యం త్రోసి పుచ్చాడు. ఇదంతా జ్ఞాపకంవచ్చి కాస్సేపు భావాతావరణాన్ని మరచిపోయాడు. విశాల శ్రీనివాస్ అర్ధ అని తెలుసుకున్న సూర్యం తన గమ్యాన్ని అర్ధంచేసుకుంటాడు. శెట్టిగారు పదివేల రొక్కం, తన దగ్గర వున్న రామం బాధ్యత సూర్యంకు అప్పచెపుతారు. విశాల బాధ్యతని సూర్యానికి అప్పగిస్తాడు శ్రీనివాస్.

## 14

ఆలోచనలకు అడ్డులు వేసింది శ్రీనివాస్ వలవరింపులు. చప్పునలేచి అతని మంచందగ్గరకు వెళ్ళాడు. అతను తెలివితోనే కళ్ళుమూసుకుని అంటున్నాడు.

'బహుశః యీ రూపుతో యీ మేధస్సుతో వుండవలసిన పని లేదేమో? నా చుట్టుప్రక్కలు యింకోదగ్గర వున్నయ్. నేనింకో విధంగా తలుస్తుండాలి. ఒకరి యిష్టాయిష్టాల ప్రకారం జీవితం నడవదు. ఒకరి కోరికలన్నీ తీరిపోతే అది జీవితమేకాదు. తీపిని తిని, చేదును విడచిపెట్టే తత్వం మనుష్యులది. చివరకు చేదులాంటి చావును మింగవలసి వస్తుంది. ఎందుకు? కడుపులో యిన్నాళ్ళూ బ్రతికి సృష్టించుకున్న పురుగులను చంపడానికి ఆ పురుగులు చావగానే మనిషి మరోజన్మ యెత్తుతాడు. క్రొత్తరూపు, ఆలోచనలు, జీవితం వస్తుంది. ఆకారాలు మారుతాయ్‌గానీ ఆత్మ మారదు. అందుకే నాకు చావంటే భయంలేదు—చావంటే భయం ముమ్మాటికీ లేదు...లేదు...లేదు...లేదు...లేదు.'

'శ్రీనివాస్...శ్రీనివాస్...'

'లేదు...లేదు...లేదు...'

'శ్రీనివాస్—తెలివి తెచ్చుకో...'

'బంధించుకుని వున్న పురుగులు చచ్చిపోతున్నయ్—బంధాలు విడిపోతున్నయ్—వస్తాను...నా ప్రియమిత్రుడా...వస్తాను... నా నుదిటిమీద చెయ్యివెయ్యి... వస్తాను... జన్మజన్మాల మిత్రుడా వస్తాను...'

సూర్యం అతని నుదుటిమీద చెయ్యి వేశాడు. సూర్యం కన్నీటిబొట్లు అతనిపై వ్రాలాయి. శ్రీనివాస్ చైతన్యం తప్పిపోయాడు. కొన్నినిముషాల్లోనే ఒళ్ళు చల్లబడిపోయింది. మిగిలింది కట్టె—ఆ కట్టె ఆరోజునే బుగ్గయిపోయింది. ఆ బుగ్గి పారుతున్న యేటిలో కలసింది. ఏరు ఆ బుగ్గిని పొలాల్లో చేర్చింది. పొలాలు ఆ బుగ్గిలో సారంతో పంటలు పండిస్తాయ్ ఆ ధాన్యంతో అతనూ, ఆమే కడుపునింపుకుంటారు. శ్రీనివాస్ భౌతికంగా పోయినా మానసికంగా ఆధ్యాత్మికంగా బ్రతికే వున్నాడు. అతని తలపు సూర్యానికి లేని ధైర్యాన్ని తెచ్చిపెట్టింది. అతని పలుకులు తల్చుకుని జీవితానికి యేదో ధ్యేయంవుందని అది కొనసాగించటంలోనే మనిషి జన్మ తరిస్తుందని సూర్యంలో పట్టుదలను సృష్టించింది. శ్రీనివాస్ చచ్చినా బ్రతికే వున్నాడు.

* * *

గోవిందరావు అంత్యక్రియలు తను జరుపలేకపోయినా శ్రీనివాస్ అంత్యక్రియలు తను జరపగలిగినందుకు సూర్యం తృప్తిపడ్డాడు. ఇలా తను జరుపగలిగాడంటే ఆ ధైర్యాన్ని ప్రసాదించింది శ్రీనివాసే అనిపించింది. భయంకరమైన చావును తన పెదాలపై నవ్వుతూ ఆహ్వానించి అనుభవించాడంటే దానికి కారణాలను అన్వేషించసాగాడు. చావేకాదు జీవితంలో వచ్చే యే యిక్కట్టులూ, కష్టాలూ, అడ్డంకులూ యెదుర్కోడానికి ఒక వేదాంతం అవసరమేమోననిపించింది. అది యెప్పుడు అలవడుతుంది? మనిషి తన మనసునుకాక ఆత్మను తృప్తిపరచగలిగినప్పుడు వస్తుందేమో?

బాహ్యంగానున్న వ్యక్తిత్వం కోరికలతో నిల్చుంటుంది. అంతర్గతమైనది కోరికలు తగ్గించుకోవటంవలన ప్రకాశిస్తుంది. సూర్యంకు యింతవరకు యేవిషయంలోనైనా, అది పైవాళ్ళ విషయంలోనైనా తనూ, తన హోదా, తనమాట, తనకీర్తి, తన గర్వం, తన అహం, తన బాగు అంతా తన తలపుకు సంబంధమై వుండేది. తన మనసుకు రూపం తను, తన ఆత్మకు స్వరూపాలు లెక్కించరానన్ని. ఆత్మను తెలుసుకోవాలంటే తన చుట్టుపట్లనున్న స్వరూపాలన్నిటినీ తన మనసులో యిముడ్చుకోవాలి. అప్పుడు యెదుటివారిపై తన విషయమై వుండే తలపులుంటాయ్. తను వ్యక్తిగా ముఖ్యంకాదు. తన ఆత్మ ముఖ్యం. అలాటి మనిషి తను కష్టపడుతున్నట్టుగానీ, అనారోగ్యంగా వున్నట్టుగానీ చచ్చిపోతున్నాననే బెంగతోగాని వుండడు. ఆత్మను దర్శించగలిగినవాడే అసలైన ఆనందాన్ని అనుభవించగలడు. చీకటి మనసుకు చంచలత్వంపోయి ఆత్మవెలుగువలన బలం కలిగి స్థిమిత మేర్పడుతుంది.

శ్రీనివాస్ తలపు సూర్యంకు తన కర్తవ్యాన్ని తెలుసుకోవటమేకాక ఆచరణలో పెట్టే మనోనిబ్బరాన్ని తెచ్చింది. హైందవ ధర్మంప్రకారం చెయ్యవలసిన తంతులన్నీ చేసాడు. విశాలకు రెండు బంగరుగాజులు చెయ్యించి టేబిలుమీద పెట్టేటప్పుడు మనసు కష్టపడింది. ఆమె నుదుట కుంకుమరేఖ లేకుండా చూడటానికి బాధపడ్డాడు. మూడు తెల్లచీరలు కొన్నాడు. ఇవన్నీ మౌనంగానే చేస్తున్నాడు. ఇవన్నీ జరిపించకూడదని తనకు తట్టలేదు. ధర్మం శాశించింది జరిగి తీరాలనే చేశాడు. ఆ యింట్లోవుంటే యింకా మనసు విచారం నుండి బయటపడదని యిల్లు మార్చేసాడు. కాలేజీకి దగ్గరగా ఒక యిల్లు తీసుకున్నాడు. రామం ఒక్కడే మొగదిక్కు. వాడికి ఆమె దిక్కు. అక్కా తమ్ముళ్ళుగా వాళ్ళిద్దరిలో అన్యోన్యం యేర్పడింది. వాడికి ఆమె చదువు చెప్పాలని నియోగించాడు. ఆమె కాలేజీలో చేరడానికి యింకా టైముంది. ఈలోగా తను ప్రస్తావన తేవటమెందుకని వూరుకున్నాడు. తను వూరికి యెనిమిది మైళ్ళ దూరంలో వున్నాడు కాబట్టి రోజూ వీరి పరిస్థితిని చూసే అవకాశంలేదు. వారానికి ఒకటి రెండుసార్లు వచ్చి చూసిపోతున్నాడు. ఆమె తన యెదరగా ఒకమాట యిప్పటికి ఆడలేదు. ఆమె మౌనం యెన్నెన్నో ప్రశ్నల వర్షాన్ని అతనిపై కురిపిస్తోంది. ఆమె దీనమైన చూపులు దిక్కులు చీల్చేటట్టు దూసే బాణాల్లా వున్నయ్. ఆమె యీ స్థితికి కారకుడు తనన్న తలపు రాగానే సూర్యం మనసు కల్లోలం కాసాగింది. మళ్ళీ తను అనుకున్న వేదాంతాన్ని మనసులో చొప్పించుకుని, బాధను తగ్గించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

మూగబాసలతో యిద్దరూ బ్రతుకుతున్నారు. అణగిన మోహం అప్పుడప్పుడూ



అగ్నిపర్వతంలా బ్రద్దలై పొగలను గక్కు తోంది. యౌవనం అగ్నిపర్వతంలాంటిది. యెల్లప్పుడూ అణిగి వుండలేదు. రాను రాను ఆమె ముఖంలో ఒకవిధమైన హుందా యేర్పడింది. తెల్ల చీరకట్టినా, చేతిలో రెండేరెండు బంగారు గాజులున్నా సొగసు విసుగు చెందకుండా వెంటవెంట పడు తోంది. ఒకనాటి హృదయం సొగసామెను కౌగలించుకుంది. ముఖంలో బొట్టు, ఒంటిమీద చుక్కచుక్కలున్న వాయిలు చీర — ఆమెను వరించింది. సూర్యం ఆమెను ఆ పరిస్థితిలో చూసి సంతోషంతో పాటు చిరాకుపడ్డాడు. తన బలవంతం మీదే ఆమె కాలేజీలో చేరింది. తొలి రోజుకు మలిరోజుకు యింత తేడా రాగానే తను తట్టుకోలేక పోయాడు. అడగనూ లేక పోయాడు. ఆమె జోడు కావాలంది. ఆమెనే వెళ్ళి కొనుక్కోమన్నాడు. కాస్త యెత్తు మడమలున్న జోడుతో తిరిగి వచ్చింది.

ఆరునెలల్లోనే యీ మార్పురాగానే సూర్యం ఆశ్చర్య పోయాడు. ఐదేళ్ళు దాటినా గౌరి యింకా ఆ దెబ్బను తట్టుకోలేక పోతోంది. ఆమె యింటి నించి యెక్కడకూ వెళ్ళి యెరగదు. వంట యిల్లే ఆమెకు స్వర్గంలా వుంది. ఆమె ముఖం చూడ్డానికే జాలిపుట్టుతోంది. ఒక్కో సారి ఆమెను చూడగానే కన్నీరు కంట్లో తిరుగుతుంది. కాని యీమె ఆచారాలకు సాంప్రదాయాలకు యిట్టే స్వస్తి చెప్పింది. సంఘానికి యెదురు తిరిగింది. ఆమె చూడ్డానికి మనోహరంగా వున్నా సూర్యం మనసులో యెందుకో ఆమెమీద ఒకవిధ మైన యేవగింపు చోటుచేసుకుంది. బహుశః అది తను విశాలకు, గౌరికి పోలికలు వెతు క్కోవటంవలన వచ్చిందేమో? లేక తనలోని లోభం కారణమేమో? యిన్నాళ్ళూ దాగున్న అందం మళ్ళీ ఆమె దరిచేరింది. తొలిరోజుల్లో తను చూసిన విశాలలా మళ్ళీ అతని కంటికి ఆమె అగపడింది. ఆనాటి అమాయకం ఆనాటి ఒకరిపై ఆధారపడే తత్వం యింకా వుందో లేదో?

ఒకనాడు సాయంత్రం తను వచ్చేసరికి విశాల బాగా తయారయి వుంది.

'వచ్చారా?' అంది.

ఎన్నాళ్ళకు ఆమె నోటివెంబటి మనసార పలుకరింపు విన్నాడు. ఏదో వీణ మీటించి నట్లు అయింది. కాఫీలయ్యాక 'మీరూ రాకూడదా?'

'ఎక్కడికి?'

'సినిమాకు.'

సూర్యం జవాబు చెప్పలేదు. ఇష్టం లేనట్లు ముఖం దించేసాడు. ఆమెకూడా మళ్ళీ అడగలేదు.

'వస్తాను' అంటూ వెళ్ళిపోయింది. ఆమె వెనుకనే వెళ్ళాడు. ఒంటిగానే వెళ్తోంది. ఇంకెవ్వరూ తోడులేరు. సినిమా వదిలేవరకూ హాలుదగ్గరనే వున్న ఒక పార్కులో కూర్చున్నాడు. ఎన్నెన్నో ఆలో చించుకున్నాడు. ఎన్నోవిధాల బాధపడ్డాడు. ఆలోచించిందే మళ్ళీ ఆలోచించుకున్నాడు. ముందుకేం జరుగుతుందో వూహించిందే మళ్ళీ వూహించుకున్నాడు. తన మిత్రుని చివరికోరిక జ్ఞప్తికి వచ్చింది. ఆమెను

## చిరుమల్లెలు

చిరు మల్లెలు
కురుల దాగెనా?
చిరుత నవ్వులు
వెల్లి విరిసెనా?
పాల వెల్లువే
పొంగి పొరలెనా?!!

పసిడి కలలు
పండు నవ్వుడు
పడుచు వయసు
పొంగుతున్నది
నింగి నేలను
వంగి చూచెను
పొంగి పాటలుతు
పలవరించెను !!

కలువ రేకులు
తలలు వంచి
కొంటె చూపులు
కోనరు వేళ
కలువ రేడు
కలువ జేత
కిలకిలించునా
కులుకు వేళ !!

— తెన్నేటి ఎలీషా

తొక్కరు చెయ్యలేనేమోనన్న అనుమానం తనలో పొడసూపింది. ఆమె చదువుయందు అంత శ్రద్ధ చూపుతున్నట్లు కనపడదు. సినిమా విడిచిపెట్టేసారు. కాస్తదూరంగా వుండి ఆమె బాల్కనీ మెట్లు దిగుతుం డగా చూసాడు. ఆమెవేపు మింగివేసినట్లు యెందరో చూస్తున్నారు. ఆమె లావ ణ్యంతో మెరసి పోతోంది. దివినుంచి భువికి దిగే అప్సరసలా దిగింది. యౌవ్వనం పూలమాలలు వేసుకుని పరిమళిస్తోంది. వలపుతేజస్సు ఒళ్ళంతా ప్రకాశిస్తూ వయ్యారం వెంట తరుముతోంది. వసంతం మళ్ళీ విశాలను చిగిర్చింది. వికసించే పూలు కాయలు కాడానికి తుమ్మెద పూల చుట్టూ తిరగాలి. ఆమె అద్దాలగోడలతో కట్టిన యింట్లోవున్న పూలచెట్టులా వుంది. ఆమె ఉద్యానవనంలో గాలితో విచ్చలవిడిగా కదిలే పూల తీగకాదు.

ఎంతదూరంగా వుండాలని సూర్యం ప్రయత్నిస్తున్నాడో అంత దగ్గరౌ తున్నాడు. ఆమెగూర్చి తలుచుకోకూడదని అనుకున్నా రోజూ తల్చుకుంటూనే వున్నాడు. ఆమె యేడాది గడిచేసరికి నిత్యం నూత నంగా అగపడే గులాబిలా వుంది. అది కోగి తపు పూవు అనుకోవటం తనకు యిష్టం లేదు. గులాబిని తాకటంవలనే అది చరితార్థం అవుతుంది. ఈ మార్పు సూర్యంకు ఒకోసారి నచ్చినట్లుండేది. యింకోసారి యీమె ఆచారాలను అతిక్ర మించిందన్న ఆక్రోశం కూడా కలిగేది. ఒకనాటి సాయంత్రం వచ్చేసరికి విశాల ఒక్కర్తే యింట్లోవుంది. యేదో ఒక పుస్తకం చదువుతోంది. అతనిని చూడ గానే పుస్తకాన్ని టేబిలుమీద పెట్టింది. ఒకసారి పుస్తకంవేపు చూసాడు.

'క్లాసు పుస్తకాలు చదువుతున్నా వను కున్నాను.'

'ఏంటో — ఇంకా చదువుకునే పిల్ల అనుకోడానికి మనస్కరించటం లేదు'

'చదవకపోతే యెలా?'

'ముందుకు పోయేదాన్ని వెనుకకు లాగు తున్నారు. ఎలా పాసవుతానో యేంటో?'

'పాసయి తీరాలి. ఈ నవలలు చదవే బదులు...'

'తలకెక్కనిది యెంత కని చదవ మంటారు?'

'ఎక్కించుకోవాలి. ఫస్టు క్లాసులో ప్యాసై ఐతేగానీ డాక్టరు అయ్యే అవకాశం వుండదు.'

'డాక్టరా ?'

'శ్రీనివాస్ కోర్కె తీర్చేబాధ్యత నామీద వుంది'

'వెళిపోతూ కోర్కెలను కూడా విడిచి పెట్టారా ?'

'డాక్టర్లై అనాధలసేవ చేస్తే వాళ్ళ దీవనలు ముందు జన్మలకు పనికివస్తాయ్.'

ఆమె ఒకసారి అతనివేపు యీ మాటలు నప్పనట్లుగా చూసింది. ముఖం త్రిప్పి.







'ఈ కంటికి కనపడని జన్మల సుఖం కోసం యీ జన్మలో సుఖాలను చంపుకో వటం సంస్కారుల లక్షణమే అంటారా?'

సూర్యం యీ ప్రశ్నకు జవాబు చెప్ప లేదు. ఆమె మౌనంగా వున్నా యింకా ప్రశ్నిస్తున్నట్లే అనిపించింది. ఏదైనా ఒక ఆపేక్షతో యెందుకు చేస్తారు మీరు? వీటిలోనూ మీ హృదయంకాదు, మీ మన సెందుకు పాల్గొంటుంది? మీరు ఆచరించ కుండా ఆలోచిస్తూ కూర్చుంటా రెందుకు? మీరు గతం లాటాకు పాత మేడలోనే నివసిస్తా రెందుకు? నవీనమైన క్రొత్త మేడలో కాలుపెట్టరేం? పాతదో త ప్పుట్టడంలేదూ? క్రొత్తదనం అందం మీకంటికి కనిపించలేదూ? మారని మీలాంటి వారికి మారే మనుషుల హృదయాల వ్యాప్తి యేం కనిపిస్తుంది? మీరు బానిసలు—నేను బానిస కాను.

అన్నివిధాల ఒక్క ప్రశ్నతోనే అతనిలో ఆలోచనలు రేకెత్తించిన విశాలలో యెంత సాహసం వచ్చింది? ఆమె ఒనాటి అమాయకురాలు కాదు. ఆవేశంతో ఆశతో, ఉత్సాహంతో అలనాడు అమృతం వొలికించిన అప్పుడే విడినట్టు పుష్పంకాదు. ఈనాడి గాలికి, వానలకూ, యెండకు తట్టుకుని నిల్చిన పుష్పం యిప్పుడు. ఆకారంలో, వ్యక్తిత్వం లోనూ, వలపులోనూ, తలపులోనూ-అన్ని విధాలా పెరిగిందామె!

* * *

యౌవనపు తొలిరోజుల్లో విశాల వెలిగిం చిన దివిటీని ఆర్పేయాలని తను యెంత ప్రయ త్నించినా ఆరటం లేదు. అది ఆర్పేయా లని యెన్నెన్నో చేస్తున్నాడు. ఆమె ముందర మనసు వలోచించి అసహ్యించుకోసాగాడు. ఆమె దగ్గరకు వెళ్ళరాదన్న నియమాన్ని పెట్టుకుని ఒకోసారి పాటించలేక పోయినా ఆచరించటానికి ప్రయత్నిస్తున్నాడు. విశా లను మరచిపోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఇలా తను చేసే ప్రయత్నాలకు కారణం విశాల తనది కాలేదన్న నిస్పృహ. ఆమెను తనదానినిగా చేసుకోవటం తన ప్రస్తుత పరిస్థితులలో కాని పని! అదీకాకుండా ఆమె తాళికట్టిన భర్తతో నివసించింది. ఆమెను తాకలేదని శ్రీనివాస్ అన్నా బహుశ విశాల ప్రేమికునికి తను చెప్పి ఒప్పిస్తాడనే వుద్దే శంతో అబద్ధం ఆడకూడదా? ఏమైనా

# నాలుగుమంచాలు

ఆమెపై ఒక ముద్ర పడింది. అలాంట ప్పుడు ఆమెను తనదానిగా చేసుకోవటం సాధ్యం కాని పని. ఈ చదువు తెచ్చిన సంస్కారం ఆమెను తనకు దూరం చేసే అవకాశాలు లేక పోలేదు. విశాల. తనను తప్ప యింకొకర్ని తలుస్తుందంటే తను సహించలేడు. శ్రీనివాస్ ఆనాడు ఆమె పరి స్థితి చెప్పినప్పుడు అతని యందు సాను భూతి చూపించినా తనను తప్ప, కట్టు కున్న మగవాడిని కూడ విశాల తలచుకోనం దుకు లోలోన సంతోష పడ్డాడు. ఆడదాని హృదయం అమృత భాండం. అందులో యెల్లవేళల యందు ఒక్క మగాడే కద లటూ ఆ అమృతం సేవించి నిత్యం యౌవ్వనంతో తొణికిసలాడటం యెంత అదృష్టం! ఆ అదృష్టం చేతురా రా వదులుకోవటం తనకు యిష్టంలేదు. ఎన్ని విధాల తర్జన భర్జనలు చేసుకున్నా విశాల ముఖం వారంరోజుల కొకసారైనా అగుపడక పోతే వెర్రెత్తి పోతున్నాడు. తొలి నాటి వలపు, జీవధారగా తనలో పారుతూనే వుంది. ఆనాటి తలపులు చావులేని గడ్డిలా మొలిచి పోయాయ్. ఒకోసారి పచ్చదనం పోయినా మళ్ళీ చిగురిస్తున్నాయ్.

ఎంతో ప్రయత్నించి రెండు వారాలు విశాల దగ్గరకు వెళ్ళలేదు. తరచు వెళ్ళి మళ్ళీ మొడివరలా ఆమెలో ఆశలను రేకెత్తించటం యిష్టంలేదు. ఒకసారి పగిలిన ఆమె హృదయాన్ని మళ్ళీ పగి లించటం భావ్యం కాదు యెంతో ప్రయ త్నించి ఆమె యెదట పడలేదు. కాని ప్రతి రోజూ ఆమె తలపే మనసులో తిరిగేది.

ఒకరోజు సాయంత్రం విశాల రామంని తోడ్చుకుని సూర్యం బంగళాకు వచ్చింది. ఆమె వస్తుండగానే సూర్యం అంగట వున్న పూల తోటలో తిరుగుతూ చూసాడు. ఆమె వచ్చినందుకు కోపంతో పాటు సంతోషం కూడా పెల్లుబికింది. ఆమె మాటాడకుండా గేటు తలుపుతీసి కాలు పెట్టగానే ఆమె అందం సంతోషాన్నే తన మనసులో నిలిపింది. రాను రాను ఆమె అందం పెంచి ఆశలను గట్టిగా నాటు తోంది కోరికలను కొల్లలుగా సృష్టించి తీర్చుకునే ఉపాయాలను కూడా యెరుక పరచేటట్లు నటిస్తోంది. అన్నిటికీ తనే చేతకాని వాడై పోతున్నారు.

ఆమె వస్తూనే తోటంతా గాలించినట్లు కలయ జూసింది. ఒక వరుస గులాబులు విరబూసి వుంటే చప్పున వెళ్ళి ఒక ఎర్ర గులాబినే తెంపి తలలో పెట్టుకుంది. అల క్షిప్తగా వెనుకనించి ఆమె చూడటానికి మనోహరంగా వుంది. వెనుకనించి వెళ్ళి చేతులను ఆమె మెడచుట్టూ పెట్టాలన్న ఆవేశం కలిగింది. ఐనా అలా కదలకుండా నిల్చుండి పోయాడు. కాడపై గుత్తులుగా పూసి కమ్మని సౌరభాన్ని వెదజల్లుతున్న లిల్లీ పూలను తాకగానే మెకు ప్రాణం వచ్చినట్లయింది. విశాల తన దగ్గరగానే రెండు లిల్లీపూలను తెంపుతుంటే ఆమె అంత అందంగా అంత సువాసనగా పరిమ ళిస్తున్నట్లు సూర్యం కనిపించింది. ఐనా కదలలేక పోయాడు. ఆమె కదులుతూ ఒకసారి అతని కళ్ళల్లోకి చూస్తూ 'ఎంత అందమైన తోట వుందని చెప్పారు కాదు.'

'రోజూ వచ్చేదానివా' అని అడగాలని ఆపేసాడు. ఆమె ఒక్కసారి అంతా చుట్టు ముట్టి తిరిగి వచ్చి ఒకసారి తలనిండా నింపిన పూలను చూసిస్తూ,

'క్షమించండి. మీ పూలను తెంపేసాను'

'ఫరవాలేదు'

'నా చేతులతో మొక్కలను నాటి వుంటే పూలను తెంపలేక పోయేదాన్ని మీరు ఫరవాలేదన్నా మీ కష్టం నాకు తెలుసు. మొక్కలను నాటినాళ్ళు పూలను తెంపలేరు'

ఈ మాటల్లో యెంతో నిజం చూసిన సూర్యం మౌనంగా ఆమెవేపు చూసాడు. ఆ విశాల అనే మొక్క యీ వ్యక్తిత్వం రావటానికి తనే కారకుడు. ఐనా ఆ మొక్క పెరిగి వలపు పూలను పుష్పింపచేసినాడు తనే వాటిని తెంపేసాడు. ఎంత సాహసం—యెంత దుర్మార్గం తనది. ఇప్పుడు మళ్ళీ ఆమెను చదివించి పూర్తి వ్యక్తిత్వంతో బాటు అందానికి అతీతమైన అందా నికి మెరుగులు దిద్ది పూలను సృష్టింప చేస్తున్నారు. ఆ పూలను తెంపడానికి సాహసించలేక పోతున్నాడు.

రామం, వంటవుట్టి కుర్రాడూ కలిసి బయటకు వచ్చారు. రామం చేతిలో పెక దస్తా వుంది.

'అక్కా—రా—ఆ పచ్చని తివాచీ మీద కూర్చొని ఆడుకుందాం'

లాన్‌లో పచ్చగడ్డి మీద కూర్చున్నారు. పేకాటలో పడ్డారు. సాయంకాలపు చల్లదనం ఆమె పెదిమలపై చిరునగవులా వుంది. ఆహ్లాదం ఆకాశమంత విశాలంగా హృదయాన్ని చేసింది. చిరు గాలికి కదిలే ఆమె ముంగురులు అతని గుండెల్లో నాట్యం చేస్తున్నాయ్. అతని చేతిలో డైమండ్ రాణి వదలలేక వదిలాడు.

పొరుగు ఆఫీసరు పెళ్ళాం ఒక్కరే ఇటువేపు చూసి 'గర్ల్ ఫ్రెండా?' అని అడిగింది. సూర్యం మర్యాదకు నవ్వాడు. ఆమె వయసులోనూ శరీరంలోనూ అంత యెదిగినా యింకా పదహారేళ్ళ బాలా కుమారి అనుకుంటుంది. ఎనిమిది గజాల నైలాన్ చీరకట్టినా పైట సరిగ్గా లేదు. తిండితో పెరిగిన బొజ్జను కదుపుకుంటూ ఫెన్సింగు దగ్గర నిల్చొని.

'అచ్ఛాహై' అంది.

ఆమెకు వచ్చిన అన్ని భాషల్లోనూ విశాల విషయమై ఒక్కొక్క కబురుగా అడుగుతుంటే సూర్యం యింకెంతసేపో వూరుకోలేక 'మిష్టర్ హుస్సేన్ లేడా?' అని యెదురు ప్రశ్న వేసాడు.

'క్లబ్‌లో ఆడుతున్నాడు.'

'నివ్వెళ్ళలేదేం?'

'నాకెక్కడి తీరుబడి—'

'మామీద దాడిచెయ్యడాని కుంటిగా!'

'నేనేం దాడిచేసాను? మిష్టర్ హుస్సేన్‌లా నివ్వూ ప్రేమించి పెళ్ళి చేసుకుంటున్నావేమోనని...'

'హుస్సేన్ ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడా?'

'అప్పుడు యీ ఒళ్ళు పెరిగిపోయింది గానీ—పదేళ్ళ క్రితం నన్ను నివ్వు చూసుంటే.'

సూర్యం నవ్వేసాడు. వీళ్ళు పేకాట విడిచి లేచిపోయారు. విశాల యింట్లోకి వెళిపోయింది. సూర్యంవేపు పొరుగామె చూసి.

'వేగంకానీ...మాకు బదిలీయైతే నీ పెళ్ళి చూడలేనుగా.'

'కాడానికేం లేదు — అసలు సంగతి తెలుసుకోకుండా ఆ పిల్లయెదురుగా అలా అనటం సబబుకాదు'

'ఏం? అంత చక్కగా వుంది.'

'ఆమెకు యేనాడో పెళ్ళయింది.'

'ఓ—సారీ! పెళ్ళయిన పిల్లలానే కనపడలేదు. ఐ ఏమ్ సో సారీ...పిల్లలు పుట్టకగానీ—నీ వయసులో మిస్టర్ హుస్సేనుకు నలుగురుండేవారు.'

'నలుగురు పిళ్ళాలే—బాబోయ్!'

'పిళ్ళాలు కాదయ్యా—పిల్లలు'

'ఏదీ'

'పుట్టేవారు కానీ పుట్టలేదు — నీ యింట్లో పిల్లలున్నా యెంత బావున్ను'

'నా పిల్లను పెంపకం యిస్తాలే'

'నీ పిల్లనైతే తప్పక పెంచుకుంటాను'

'ఏం?'

'నివ్వంటే ... మంచివాడివి ... చక్కని వాడివి.'

సూర్యం అసలు విషయం అర్థం చేసుకుని నవ్వేసి 'వస్తాను' అని వెళ్ళిపోయాడు. తల్చుకుంటుంటే తనకు నవ్వు వస్తోంది. డ్రాయింగు రూములో సోఫా మీద చతికిలబడ్డాడు. ఎదురుగా వున్న కిటికీ మీద మూలకు రెండు కొమ్ములతో చేసిన కొంగలు మూతులు పైకెత్తి తపస్సు చేస్తున్నాయేమోనన్న అనుమానం కలగసాగింది. నీటిలో కదిలే చేపపై పడటానికి కొంగ కాసుకు వున్నట్లే అవకాశం దొరికితే విశాలను తాకి తన హృదయం విప్పటానికి తను సిద్ధంగా వున్నట్లు తట్టింది. కాదు కాదని మళ్ళీ మనసు మార్చుకోబోయాడు. నిజం కాదని నిరూపించటానికి ప్రయత్నించినా దాని స్వరూపం మారదు. కిటికీపై యింకో ప్రక్క అలాగే వాలి లోలోన కొట్టుకుని బయటకు కనిపించే అంశాలను అర్థాలను సృష్టిస్తున్నట్లే వారి గుండెలు కొట్టుకుని వాటి ముఖాలపై కోరికలను ప్రతిబింబింపచేస్తున్నయ్. ఆ అలాగే వాలి గగనాన్ని ప్రేమిస్తే బావున్ననిపించింది. ఆ వాలి బదులు తనే ప్రేమిస్తే బావున్ననిపించింది, ఆ వాలీ బదులు తనే ప్రేమించి ఆమెను మేల్కొలిపి తనను చేరేటట్లు చేస్తే?

కొద్ది క్షణాలపాటు ఒంటిగా కూర్చొని మనసును కోరికల వనం లోనికి విడిచి పెట్టేసాడు ఆ వనంలో అందచందాలు నిండిన పూలచెట్ల మధ్య బుస్సుని పడగెత్తే పామును చూడగానే తిరిగి పరుగెత్తి వచ్చినట్లు తన కోరికల నించి యథార్థాన్ని తెలుసుకుని బయటపడ్డాడు. విశాల తనదెలా అవుతుంది? అది సంఘ దృష్టిలో యింకొకరి సొత్తు, ఆమెను ఆత్మశ్రద్ధగా అప్పగించటమే. తనపని!

బయట దప్పులు వాగుతుంటే వేళకు పెరటి కూరగాయల తోటలో వున్న వంటపుట్టి తోసహా అంగటికి వచ్చారు.

'సినిమా—మంచి సినిమా'

'పాతది'

'అలాంటి సినిమాలు యిప్పట్లో రావటమే లేదు—వెళ్దాం.'

'నే రాలేను. దగ్గరే-మీరు వెళ్ళండి.'

అని సూర్యం మళ్ళీ గదిలోనికి వెళ్ళిపోయాడు. మైలు దూరంలో చిన్నహాలు వుంది అక్కడకు తరచు పాతసినిమాలు వస్తుంటాయ్. యీ భోజనాలు అయ్యేసరికి యెనిమిదైంది. ఆ రాత్రిమీద రెండో ఆటకు రాలేనంది. ఆఖరికి వంటపుట్టి.



# నాలుగు మంచాలు

లేచి బయలుదేరారు. వాళ్ళు వెళ్ళే సరికి డ్రాయింగురూములో యెదురెదురు సోఫాల్లో సూర్యం, విశాల కూర్చొనివున్నారు, మనిషో మేగజేన్ తిరగవేస్తున్నారు. వాళ్ళేమీ చదవటంలేదు. ఏమీచూడటంలేదు. త్రిప్పిన పేజీలే మళ్ళీ త్రిప్పుతున్నారు. సూర్యం ఒకసారి లేచి ఆమె యేమి చూస్తుందో నని వెళ్ళిపోతూ ఆగి వెనుకనించి చూసాడు. ఇంగ్లీసు మేగజీన్‌లో ఒక చక్కనిరంగుల్లో డ్రాయింగ్‌రూము అలంకరణ. తివాసీల గురించి యెడ్వర్టయిజ్ మెంటు. తన గది లోనికి వెళ్ళినా యెంతసేపో వుండలేక తిరిగి డ్రాయింగ్ రూమ్‌లోనికే వచ్చాడు. ఉండుండి ఒకసారి మేగజిన్ దించి ఆమె వేపు చూస్తున్నాడు. ఆ ప్రశాంతమైన వాతావరణంలో ఆమె సమ్మోహనంగావుంది. ఈ అందాలు చిలికే హార్మ్యంలోనికి మేఘాల చాటునించి మెరుపుకన్నె దిగివచ్చి నట్లుంది. ఆమె వెన్నెలలు వెదజల్లే అందం అతని శరీరాన్ని పులకరింప జేస్తోంది. నిండువెన్నెల్లో ఆకాశంవేపు చూస్తూ విహరించే ప్రేమికునిలా ఉన్నాడు. ఒకసారి లేచి బయటవరండా లోనికి వెళ్ళి నించున్నాడు. విరబూసిన పూలమొక్కలతోట వెన్నెల వెలుగులో వయ్యారంగా వెలిగిపోతోంది. జవ్వని నవ్వే పెదిమల్లా పూలు కదలుతూ మకరందాన్ని పూరిస్తున్నాయ్. తుమ్మెదలు నిద్ర పోతున్నాయని గాలి సంతోషంతో ఆవేశపడి పూలను తాకుతూ కదుపుతూ వీస్తోంది. ఆకారంలేని ఆత్మలాంటి గాలుల తాకిడితో ఆకారం వున్నపూలకు సమ్మంధమేమిటి? ఆకారంగల తుమ్మెదల అనురాగంతో పాడే ఝుంకారం ఆ పూలను పులకరింప జేస్తుంది. అందమైన ఆకారంతో ఉన్న విశాలకు తన ఆత్మతో యేం పని—తన శరీరంతోనేవుంది, వలపుపండని శరీరం పులకరించదు. పులకరించని దేహాలు అమృతాన్ని సృష్టించ లేవు.

విశాల గదినుంచి బయటకువస్తే యెంత బావుణ్ను అనిపించింది. తను పిలవాలని కామోసు వేచివుంది. తను పిలిస్తే వేరే అర్థాలను సృష్టించవచ్చు. ఏమిటో ఆమె గురించి తలచుకున్నప్పుడల్లా రెండు కళ్ళు ఆగుపిస్తూనే వుంటాయ్. జన్మజన్మాల మిత్రునికళ్ళు తనవెంటనే వున్నయ్. ఆ కళ్ళనుతప్పితే ఏమీచెయ్యలేడు. తను ఆనాడు తన ప్రియునికి వేర్పున్నాక్కేగానీ

ఆ ముక్కలు హృదయంనుంచి రాలేదని తనకు తెలుసు. మనసుపడే ఆ వేదనను తగ్గించుకోడానికి లోభం చంపుకోడానికి ఒప్పుకోకపోయినా చంపుతున్నానని అనుకుని అన్నమాటలవి. తాళికట్టిన భార్య తన అనంతరం యెల్లప్పుడూ తన్నే తలచుకొని ప్రేమించాలనే కోరిక ప్రతి మగవాడికి వుంటుంది. అది మగవాడికి ఆడదాని సర్వస్వం తన స్వాధీనమనే అహంవలన వచ్చినది. అందుకే తను అనుబంధమైన కోరిక నింకొకదాన్నికూడా చేర్చాడు. ఇంకొకని భార్యను తను ఒంటిగా తన యింట్లో పెట్టుకని వాంఛిస్తున్నానన్న తలపురాగానే తనలో పుట్టినవేడి చల్లార నారంభించింది.

తను పిలవకండానే విశాల బయటకు వచ్చింది తన యెదరగానే వెన్నెల్లో ఆహ్లాదంగా యిటూ ఆటూ లాన్‌లో విహరించింది. పండు వెన్నెలను పౌడరులా రుద్దుకున్న గడ్డిపై వయ్యారంగా పడకుంది. సూర్యం కలగంటున్నట్టు అంతా చూస్తున్నాడు. యౌవ్వనపు తొలిరోజులనించీ పలవరిస్తున్న హృదయాధి దేవత వలపుల రాజ్ఞి. మనోహరి యెదరగా దేవ విమానంలో నించి దిగి తనను ఆహ్వానిస్తున్నట్లనిపించింది, విశాల గతంలోని గంట్లను కప్పేసింది. బ్రతుకుమీద యెంత విశ్వాసం అభిరుచి, తీపి లేకపోతే అంతసాహసం చెయ్యగలుగుతుంది? ఆమెకు యిహలోకంతోటే, యీ లోకంలో ఆనందాన్ని యిచ్చేవన్నీ ఆస్వాదించాలన్న కోరికలతోనే సంబంధం వున్నట్లుంది. లేదా అంటే ఆమెలో యింతమార్పు రావటానికి కారణం?

సూర్యం ఆమెదగ్గరగా వెళ్ళకండా వుండలేకపోయాడు. మౌనంగా వెళ్ళి ఆమె గడ్డిపై పడుకున్న చోటునే దగ్గరగా కూర్చున్నాడు.

'వచ్చారా?' అని పలుకరించింది.

'విశాలా—నివ్వు' అని అడుగుదామన్నది అడగలేక పోయాడు.

'ఇంత వేగిరం యెలా మారిపోయావని అడుగుదామని మొగమాట పడ్తున్నారు కదూ!'

సూర్యం బదులు చెప్పలేదు.

'నా మార్పుకు కారణం అతని క్రౌర్యం, మీ అనురాగం'

'శ్రీనివాస్ నిన్ను బాధపెట్టాడా?'

ఆమె కళ్ళల్లో ఒక్కసారి నీళ్ళు నిండుకున్నాయ్.

'ఆరోజులు మిమ్మల్ని చూసి మరచిపోయాను. మళ్ళీ తల్చుకునేటట్లు చెయ్యకండి.'

'విశాలా క్షమించు శ్రీనివాస్ నిన్ను కొట్టాడా తిట్టాడా?!'

'హాఁ ఎంతకాలమో నాకోసం వేచివున్నాడట, నన్ను ముట్టుకునే అధికారం తాళికట్టి సంపాదించాడు. ఆ అధికారం తనకులేదని తట్టి ఆవేశపడ్డాడు.'

'ఆ అధికారం యెందుకిచ్చావ్ విశాలా?'

'మిమ్మల్ని తల్చుకుని బతకడానికి?'

'అతనిని కట్టుకోపోతే బతకలేవా?'

'నేను, మిమ్మల్ని తాకిన యీ శరీరాన్ని యింకొకరికి అమ్ముకోవటం యిష్టంలేదు. నా పట్టుదలతో మామ్మ ప్రాణాన్ని తియ్యదల్చుకోలేదు'

'కానీ యింకో ప్రాణినే బాధ పెట్టావుగా'

'విధి లేకపోయింది. బహుశః తొందరపడ్డానేమో! నా యీ తొందరపాటుతో చేసిన పనికి మీరు క్షమిస్తారనే ఆశతోనే చేసాను'

సూర్యం మౌనంగా ఆమెవేపు చూసాడు.

'నేను తొందరపడ్డాను. మీరు తొందరపడలేదుగా! మీరంటే నాకెంతో విశ్వాసం మీతలపునాకు యెక్కడలేని ధైర్యాన్నిస్తుంది. మీరు వేరు నేను వేరు అని తల్చుకోలేను, క్షమించండి...ఏంటో యిలా మనసువిప్పేసాను పిచ్చిదాన్ని...కాకపోతే—ఏంటి నావేషం—ఇవేం మాటలు—లోకం హర్షించదు. మీరు లోకానికి జడుస్తారు—లోకం జయిస్తుందో మీరు జయిస్తారో చూడటానికి బ్రతికి వున్నాను—అబ్బే—యీ పిచ్చిదానిమాటలను మనసులో పెట్టుకోకండి—'

సూర్యం దుఃఖంతో గుండె బరువెక్కి మాటాడలేదు. ఆకాశం వెన్నెలతో వెలిగిపోతోంది. ఒక నీలితెరలా కనిపిస్తోంది. ఈ విశాల వెన్నెల్లో వెలిగిపోతున్నా, ఒక ఆకారంతో కనిపిస్తున్నా అనంతమైన ఆకాశం లాంటిదని అతనికి తోచింది. ఆకాశాన్ని ముట్టుకోలేనట్టే ఆమెనూ తను ముట్టుకోలేననుకున్నాడు.

(ఇంకా ఉంది)




నేనూ కాలేజీ చదువు ముగించి వచ్చేస్తూ మా మదర్ ప్రిన్సిపాల్ దగ్గరికి వెళ్ళాను ఆటోగ్రాఫ్ పుస్తకం పట్టుకుని, ఆవిడ ఇటాలియన్. చాలా వయస్సు మళ్ళినావిడ. కాని చాలా సరదా అయిన తత్వం. ఇంకెవరేం పెట్టారో అన్నీ చూసి చివరికి ఆంగ్లంలో రాసారు. 'ఇబ్బంది నిన్ను యిబ్బంది పెట్టేదాకా యిబ్బంది పడకు. లేకుంటే యిబ్బంది రెట్టింపు అవడమే కాకుండా అందర్నీ యిబ్బంది పెడతావు' అని...ఎప్పుడూ అనుకుంటాను—అన్నిటికీ యిబ్బంది పడిపోయి, బాధపడిపోయి ప్రాణాలుతోడే స్వభావం కల అందరు యీ లైన్సు కంఠతా పట్టాలని! నిరుపయోగమైనదని తెలిసే ఉట్టినే బాధపడిపోవడం అందరూ చేసే పనే. యింకా కొందరుంటారు. వారికి వర్రీ అవడం కాలక్షేపంగా తోస్తుందనుకుంటాను. ఎక్కడా ఏం లేకపోతే చుట్టూ కలయచూసి ... ఏదో ఒకటి కని పెడతారు వర్రీ అవడానికి.

ఇలా వర్రీ అవకుండా ఉండడానికి ఏదైనా దారుందా?' నాకో తెలిసినావిడ వుంది. గత పదిహేనేళ్ళ నుంచి ఒకటే తపన — తన కుటుంబం చితికిపోతోందని. తన భర్తని పరాయిస్త్రీలు వడేసుకుంటారని. ఈ వర్రీతో బెంగతో కాలక్షేపం చేస్తోంది. మొన్నీమధ్య కనిపించి 'ఏం లాభం? నా వర్రీ, నా బాధ, పడ్డవి పడ్డట్టుగానే ఉన్నాయి. వారు వేరింటి కాపురం పెట్టుకున్నా రా మహాయిల్లాలితో' అంది నిశ్చింతగా. ఎలా వచ్చిందబ్బా యీవిడ గారికీ నిశ్చింత? అంటే బాధపడీ ప్రయోజనం శూన్యం అని తెలిసోగానే జ్ఞానోదయం కల్గినట్టుంది!

అంచేత వర్రీ పడవలసిన స్థితి ఏర్పడితే ఏంచేస్తారు? దాన్ని తొలిగించే మార్గాన్వేషణ చేస్తారు. అంతేగాని రెండు గంటల రైల్లోనే బయలుదేరాలి? మూడు గంటలకి మీటింగు అంటూ ఎలాగ? ఎలాగ? అంటూ బాధ పడుతూ కూర్చోరు. ఒంటిగంటన్నర బండికి కావాలంటే టిక్కెట్టుకొనే ప్రయత్నం చేస్తారు. అవునా? ఓ అరగంట అటూ యిటూ కాలక్షేపం చేయడం మేలుకదా — టైముకి అందుకుంటానో లేదో అనే వర్రీకంటే.

చిన్నచిన్న విషయాలని కొండంతగా పెంచుకుని బాధపడిపోతూ వుంటారు కొందరు. చుట్టాలొచ్చేసరికి యిల్లు బాగా సర్దకపోతే ఎలా? అన్న వర్రీలో సగం చిక్కి శల్యం అవుతుంది — కళలాంటి స్నేహితురాలు! నీకేంపిచ్చా? నీయింటికి వచ్చేవాళ్ళు నీకోసంవస్తారా? నీయిల్లెలా వుందో మెచ్చి మేకతోలు కప్పుతారా? అంటే—ఆ తత్వం వేరు అంటుంది. బాధపడీ ప్రయోజనం లేనప్పుడు కొన్ని విషయాలను గురించి మనస్సు పాడుచేసుకోకూడదు, మార్గాంతరం అన్వేషించాలి. లేకుంటే మా స్నేహితు లొకాయన వున్నారు. 'నాకేం బాధలేదు' అనే బాధ వారిని జీవితాంతం ప్రాణాలు తోడిందంటే నమ్మండి! కొన్నాళ్ళకి కీళ్ళనొప్పులొచ్చి నడవలేనిస్థితికి వస్తే 'మీకు మీరే దిష్టి పెట్టుకున్నారు—నాకేం బాధలేదు అంటూ' అన్నాం మేమంతా!

అయ్యో, వర్రీ పని కంటే ఎక్కువ చంపుతుంది. అందుకే ఏవైనా నిర్ణయాలు చేయదల్చుకున్నప్పుడు వాటిని త్వరగా చేసి మరిచి పోవాలంటాను. ఏదో ఒకటి చేయాలనుకున్నప్పుడింక తాత్సారం దేనికి? తలనొప్పికి. తప్పేమో? రైటేమో? టూ లేటేమో! అనుకుంటూ కూర్చోడం దండగ. తల్లులకి సహజంగా పిల్లలంటే వర్రీ ఎక్కువ. కాని యిదే మరీ విపరీతంగా తయారైతే తల్లికి ఎంతదూరంగా వీలైతే అంతదూరంగా పోవాలని చూస్తారుపిల్లలు. నేనంతే రాత్రిలేటు అయితే శంకర్ కోసం చూసి చూసి చివరికి వాడూ రాగనే 'నువ్వేరా?' అంటూ తలుపు తెరుస్తే తిక్కరేగి 'కాదు—నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్!' అంటాడు. 'అయినా అలా మెలకువగా కూర్చోడం దేనికి?' విసుక్కుంటాడు. అంతే మరి, మా అల్లుడూ ఉన్నాడు. ఆఫీసు సమస్య యింటికి తెచ్చి—అన్నంతో పాటే నములుతాడు. రాత్రి నిద్రలో కూడా అదే ధ్యాస. చివరి కది తేలదు. అంచేత ఆఫీసు సమస్యలక్కడే తాళం వేసి రాగల వారు అదృష్టవంతులు. మర్నాడు వెళ్ళగానే టక్కున పరిష్కారం తట్టవచ్చు.

బాధపడ్డంతో వచ్చిన చిక్కొకటివుంది. దాన్ని తొలగించే మార్గం దొరికి చావదు...వర్రీవల్ల ప్రయోజనం ఉంటే —ఎంతేనా యిదైపోవచ్చు. కాని అదో నెగెటివ్ ఆందోళన మన పిరికితనానికి నిదర్శన. ఏమీ ఎప్పుడూ జరగనిదానికి కూడా అది చిహ్నం కావచ్చు. 'వర్రీ చేసి చంపకండి. వర్రీ పడి చావకండి' అన్న స్లోగన్ బాగుంటుంది కదూ? ■

## పెద్దకథ ప్రారంభం:

# నేను మామూలు మనిషిని



ఉన్నవ విజయలక్ష్మి

'సావిత్రి వుత్తరం వ్రాసింది. సరళని హైదరాబాదు పంపించమని.'...... చేతిలోవున్న కాగితంవంక చూస్తూ అన్నారు శంకరంగారు.

మధ్యాహ్నం పదకొండు గంటల వేళ. పరుపులమీది దుప్పట్లూ దిండు గలేబులూ మారుస్తున్న పార్వతమ్మ ఆ పని ఆపి తల ఎత్తి భర్తవంక చూస్తూ,

'సరళని పంపించమనా.' అంది తెల్లబోతూ.

'అదెప్పుడూ హైదరాబాదు చూడలేదు— వచ్చే నెలలో ఎగ్జిబిషనూ అదీకూడ చూసి కొన్నాళ్లు సరదాగా ఇక్కడవుండి వస్తుంది. అంటూ వ్రాసిందిలే. వీలయితే నాలుగు రోజులు శలవుపెట్టి నన్ను తీసుకొచ్చి దిగబెట్టమంది. లేకపోతే ఇక్కడ ఫలానా రోజు రైలు ఎక్కిస్తున్నామని ముందుగా వ్రాస్తే, అక్కడ స్టేషనుకి వాళ్లు వచ్చి తీసుకువెళ్తారుట...'

'బాగానే వుంది.' వడబడమ వుత్తరానికి అర్థం ఏమిటో అంతుపట్టని దానిలా చూస్తూ పొడిగా అంది పార్వతమ్మ.

'బాగుండకపోవటానికేముంది ఇందులో— సరాయిచోటుకేం పంపటం లేదు మనం. మేనత్తగారింట్లో ఓ నెల్నాళ్ళపాటువుండి వస్తుంది — నా శలవింకా వారం రోజుల పాటు వుండనే వుంది. రేపు తీసుకువెళ్లి దిగబెట్టి వస్తాను.' అన్నారు శంకరంగారు వుత్తరం భార్యచేతికి అందిస్తూ.

ఆ తరువాత కాస్సేపు ఆ విషయమ్మై భార్యా భర్తలు తర్జన భర్జనలు పడ్డారు. మేనత్త వుత్తరం చదువుకున్న సరళకి కూడ తండ్రిలాగే అక్కడికి వెళ్లి రావటంలో ఏదో న్యూనత వున్నట్లు అనిపించ లేదు. అందుకే వుత్సాహంగా ప్రయాణం అయింది.

ఒంట్లో కాస్త నలతగా వుండటంవల్ల, కాస్త విశ్రాంతిగా ఇంటిపట్టున కూర్చుందాం అని పదిహేను రోజులు శలవుపెట్టిన శంకరంగారు తన ఒంట్లో చికాకునికూడ లక్ష్యపెట్టకుండా మర్నాడే కూతుర్ని వెంటపెట్టుకుని హైదరాబాదు రైలు ఎక్కాడు.

* * *

సరళ హైదరాబాదువచ్చి నాలుగు రోజులయింది. రెండు రోజుల క్రిందటే శంకరంగారు ఇంటికి వెళ్లిపోయారు.

'ఇది వచ్చి నాలుగు రోజులయినా ఊరు

చూడటం పడనేలేదు.' అంది సావిత్రమ్మ ఉదయం కొడుక్కి కాఫీ ఇస్తూ.

'నేనేదో తీసుకు వెళ్లనట్టు మాట్లాడతా వేమిటి? మామయ్య వుండగానే వెడదాం అంటే తనేమో తలనొప్పి అదీ అంటూ ఎక్కడికీ రానన్నాడు మరి.' నవ్వుతూ సరళవంక చూస్తూ కాఫీగ్లాసు అందుకున్నాడు మోహన్.

'పరేలే — అన్నయ్య కసలే ఒంట్లో బాగుండ లేదు. పైగా ప్రయాణం బడలిక — ఇవాళ సాయంకాలం సరళని తీసుకువెళ్లి పబ్లిక్ గార్డెనూ, నౌబత్ పహాడూ చూపించి తీసుకురా.'

'ఇదుగో సరళా, ఇప్పుడు ఉదయం ఏడు గంటలయింది. సాయంకాలం అయిదు గంటలకి బయలుదేరుదాం — ఈ మధ్యలో నీ ముస్తాబుకి ఎంత టైముకావాలో...' మోహన్ నవ్వేస్తూంటే సరళ మూతి ముడుచుకుంది.

'అదేం గంటలు గంటలు అద్దంముందు నిలబడి ముస్తాబు చేసుకోదు. అయిదు నిముషాలలో తెమిలి తయారవుతుంది.' ఆపేక్షగా మేనగోడలివంక చూసుకుంటూ అంది సావిత్రమ్మ.

'నువ్వుకూడా రా. అందరం సరదాగా వెళ్దాం.' అంది సరళ.

'నేనిదివరకు చాలాసార్లు చూశాను— అయినా నాకంత ఓపిగ్గాలేదు.' తప్పించుకోబోయింది సావిత్రమ్మ.

'అదివరకు చూసినది మరోసారి చూడ కూడదా ఏమిటి? పోనీ ఇవాళ రాలేకపోతే అందరం మరోనాడే వెళ్దాం' సరళ బలవంతం చేస్తుంటే సావిత్రమ్మ మరేం మాట్లాడలేదు.

మోహన్ ఏ భావం వ్యక్తం కానివ్వకుండా ఓసారి సరళవంక చూసి మళ్లీ తలతిప్పి కాఫీ త్రాగటంలో మునిగిపోయాడు.

సాయంకాలం అయిదు గంటలు కావస్తూంటే సరళ జడవేసుకుని, మొహం కడుక్కుని వచ్చింది. తిలకం దిద్దుకుని బట్టలు మార్చుకుందాం అనుకుంటూంటే సావిత్రమ్మ పిలుపు వినిపించి గదిలోంచి ఇవతలకి వచ్చింది.

వీధిలోకి అమ్మకానికి వచ్చిన చేమంతి పువ్వుల చెండుకొని లోపలికివచ్చిన సావిత్రమ్మ మేనగోడలివంక తృప్తిగాచూసి ఆ చెండు తలలో తురిమింది అభిమానంగా.

మేనత్త అలా అలంకరిస్తూంటే సరళ మనస్సులోకి కొన్ని సంవత్సరాల క్రిందటి సంఘటన తాలూకు నీడలు పరుచుకున్నాయి.

సరళకి పది ఏళ్లప్పుడు — సంక్రాంతి పండుగనాడు — వాళ్ల వూళ్లో, సావిత్రమ్మ సరళకి జడనిండా చేమంతి పువ్వులు కుట్టింది. జడమీద పెద్దచెండు పెట్టింది. పండగనాడు సరదాగా పువ్వులజడ కుట్టించుకుని, కొత్తపరికిణీ జాకెట్టూతో ముస్తాబయిన సరళ అద్దంలో తన ప్రతిబింబం చూసుకుని మురిసిపోతూ ఇంకా ఇంకా తృప్తితీరక మరో చిన్న అద్దం తలవెనక పెట్టుకుని పూలజడ అందాన్ని కూడ చూసుకోటంలో మునిగిపోయింది. మోహన్ వెనకనుండి ఎప్పుడు వచ్చాడో ఆపిల్ల గమనించలేదు. పండుగకి గుమ్మాలకి కట్టిన మామిడి తోరణంలోనుండి ఓరెమ్మ తీసి చటుక్కున సరళ తలలో గుచ్చుతూ,

'ఇప్పుడింకా బాగున్నావు.' అన్నాడు పకపక నవ్వుతూ. సరళకూడ నవ్వేయబోయింది గాని అక్కడేవున్న సావిత్రమ్మా వాళ్లు నవ్వుతూంటే ఉడుకుమోత్తనం వచ్చి, గబుక్కున మోహన్ షర్టు అంది పుచ్చుకుని. అతను పారిపోయేలోపునే ఆ మామిడి రెమ్మతో వీపుమీద నాలుగు వడ్డించింది.

'అయ్యో, నీ ఇల్లు బంగారంగానూ, వాడేదో హాస్యం చేస్తే ఇంత ఉడుక్కుంటున్నావు. రేపు పెళ్లాయాకకూడ ఇలాగే మర్యాద చేస్తావా ఏమిటి?' అంది సావిత్రమ్మ నవ్వుతూనే

'ఛ, నేను బావనేం పెళ్లిచేసుకోను' అంది సరళ రుసరుస లాడుతూ.

'నువ్వు చేసుకునేదేమిటి, నేనే నిన్ను; శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని ఎత్తుకుపోయినట్లు, తీసుకువెళ్లిపోయి పెళ్లి చేసేసుకుంటాను' అన్నాడు మోహన్ గుమ్మందగ్గరే నిలబడి వెక్కిరిస్తూ.

'రుక్మిణీదేవి కబురు పంపితే వచ్చి తీసుకువెళ్లాడేకాని శ్రీకృష్ణుడు బలవంతంగా ఏమీ ఆమెను తీసుకుపోలేదు.' ధీమాగా సమాధానం చెప్పింది ఐదు ఫారం తెలుగు పుస్తకంలో రుక్మిణీ కళ్యాణం పాఠం చదివిన సరళ...

ఆలోచిస్తూ చీర కట్టుకుంటున్న సరళ అదోలా నవ్వుకుంది.

'ఇంకా కాలేదుటే, చివరికి మీ బావ చెప్పినంత సేపు చేసేలా వున్నావు చీర సింగారించేసరికి,' అని సావిత్రమ్మ హాల్లోంచి ఓకేకపెట్టటంతో గబగబ చీర అంచులు సరిచేసుకుని మరోసారి అద్దంలో చూసుకుని ఇవతలకి వచ్చింది.

ముగ్గురూ బయలుదేరి, చూడదలుచుకున్నవి చూసి రాత్రి ఎనిమిది గంటలకి తిరిగివచ్చారు.

* * *

మోహన్ ఉదయం ఎనిమిది గంటలకే భోజనం ముగించుకుని లేబరేటరీకి వెళ్లిపోతాడు స్కూటరుమీద, అతను తిరిగి వచ్చేసరికి సాయంకాలం నాలుగు అవుతుంది. అప్పుడు మళ్లీ స్నానం చేసి, ఫలహారం, కాఫీ ముగించుకుని ఏ స్నేహితులింటికో క్లబ్బుకో వెళ్లి రాత్రి ఎనిమిదింటికి వస్తాడు. ఏ సినిమాకో, బజారుకో వెళ్లాల్సిన పనివుంటే తప్ప అతను సాయంకాలాలు ఇంట్లో వుండడు.

మేనమామవున్న రెండు రోజులూ ఆయనతో ఏవో ఖబుర్లుచెప్తూ ఆయన ఆరోగ్యం గురించి కనుక్కుంటూ ఇంటిపట్టునే వుండిపోయాడుకాని ఆయన వెళ్లిపోయాక అతని దినచర్య యథాప్రకారం అయిపోయింది.

సరళ వచ్చి పదిహేను రోజులయింది. ఈ కాలంలో ఒకసారి నౌబత్ పహాడ్ అవీ చూపించటానికీ, మరోసారి సినిమాకి తీసుకువెళ్లటానికీ మాత్రం అతని సాయంకాలం ప్రోగ్రాం మార్చుకున్నాడు కాని మిగతా సాయంకాలాలు అతను ఇంటిపట్టున వున్నదే లేదు.

కొడుకు ప్రవర్తన ఇలాగే వుండవచ్చును అని ముందే వూహించిన సావిత్రమ్మకి అది అంత ఆశ్చర్యం అనిపించలేదుకాని బాధపడకుండా వుండటం మాత్రం ఆవిడకి సాధ్యంకాలేదు—లోలోపల నొచ్చుకుంటూనే మేనగోడలు చిన్నబుచ్చుకోకుండా పైకి నవ్వుతూ సరదాగా ఏవేవో ఖబుర్లు చెప్తూండేది.

మోహన్కూడ ఉదయం లేబరేటరీకి వెళ్లేదాకానూ ఆ తరువాత ఇంట్లో వున్నంతసేపూ సరళతో సరదాగానే మాట్లాడేవాడు. మధ్యమధ్య హాస్యాలుచేసేవాడు. నవ్వేవాడు. నవ్వించేవాడు — అయితే అతను ఎంత సరదాగా మాట్లాడినా ఎన్ని ఖబుర్లు చెప్పినా అతని అంతరంగంలో తను ఆశించిన భావం లీలామాత్రంగా కూడా వ్యక్తం కావటంలేదు అనిపించేది సరళకి. ఆ మార్పు ఎలా వచ్చిందో ఎప్పుడు

వచ్చిందో తెలుసుకోవాలని ఆ పిల్ల మనస్సు ఆరాటపడిపోయేది ఒక్కోసారి.

తను వచ్చినదగ్గరనుండీ అత్తయ్య తన కేదో చెప్పాలనుకుంటుందని, చాలాసార్లు అది చెప్పటంకోసం దగ్గరగా వచ్చి, పెదవి చివరదాకా వచ్చినమాటని అంతలో మింగేసి చటుక్కున వెనక్కి తిరిగి వెళ్లిపోతోందనీ కూడ సరళ గ్రహించింది.

'ఏమిటత్తయ్యా ఏదో చెప్పాలని ఆరాట పడుతూ మళ్లీ అంతలోనే వెనక్కి తగ్గు తున్నావు' అని అడగాలని సరళకి కూడ చాలాసార్లే అనిపించింది. కాని, 'సరే ఎప్పుడో అప్పుడు ఆవిడే చెప్తుంది' అని సరి పెట్టుకుని వూరుకుంది.

ఆవాళ ఆదివారం.

'ఇవాళ ఎగ్జిబిషన్‌కి వెళ్దాం. నాలుగు రోజులయిందిగా అది మొదలయి. ఈపాటికి అన్ని దుకాణాలు తెరుస్తారు' అంది సావిత్రమ్మ మధ్యాహ్నం భోజనాలవేళ.

'ఇవాళ, ఆదివారం. చాల్ రష్ వుంటుంది' అన్నాడు మోహన్ నెయ్యి వేసుకుంటూ.

'ఉంటే వుందిలే. ఎవ్వరూ రాకుండా మన ఒక్కరికోసం తెరుస్తారా ఏమిటి ఇలాంటివి' విసుగ్గా సమాధానం చెప్పింది సావిత్రమ్మ.

సరళ పక్కుమనినవ్వి 'అది కాదత్తయ్యా, అంత రష్‌లో నువ్వు తప్పి పోతావేమోనని బావ భయం' అంది.

'అమ్మమాట కాదుగాని, నువ్వు తప్పి పోతావేమో, మళ్ళీ వెతికి మామయ్యకి అప్ప గించాలి కదా అని నా భయం.' అన్నాడు మోహన్ వెక్కిరింతగా.

సరళ మూతి ముడుచుకుంది.

'అది నాలా చదువూ సంధ్యా లేనిదా ఏమిటి, భయపడటానికీ, నువ్వు వెతికే దాకా బిక్కుబిక్కుమంటూ కూర్చోటాని కీను. రిక్షా చేయించుకుని చిన్నగా మనింటికి వచ్చేస్తుంది' అంది సావిత్రమ్మ.

'అలా చెప్పు అత్తయ్యా' అని సరళ గాంభీర్యం నటిస్తూంటే అందరూ నవ్వే శారు.

సాయంకాలం.

అందరూ తయారయి ఇంక తలుపులు తాళాలు వేసుకుని బయలుదేరుదాం అను కుంటూంటే వీధి గుమ్మంలో స్కూటరు

## నేను కోహావుహాలం...

ఆగింది. ఓ పాతికేళ్ళ యువకుడు, ఇరవై ఏళ్ళ అమ్మాయి లోపలికి వస్తూంటే మోహన్ వుత్సాహంగా ఎదురువెళ్లి సంతోషంగా ఆహ్వానించి లోపలికి తీసుకు వచ్చాడు.

'ఆంటీ, మీరంతా ఎక్కడికో వెళ్లే ప్రయత్నంలో వున్నట్టున్నారే ... మీ యింటికి చుట్టాలు వచ్చినట్టున్నారు' అంది ఆ అమ్మాయి సావిత్రమ్మతో గలగలా మాట్లాడేస్తూ.

'మా మేనకోడలు సరళ ఈ మధ్యే వచ్చింది' అని.

'ఈ అమ్మాయి మాలతి, వీళ్లన్నయ్య, మీ బావా ఒక్కదగ్గరే పనిచేస్తారు. బాగా స్నేహం' అంది సరళతో సావిత్రమ్మకి వచ్చిన వాళ్ళిద్దర్నీ పరిచయంచేస్తూ.

'ఎగ్జిబిషన్‌కి వెళ్లివద్దాం అని బయలు దేరబోతున్నాం. రండి కూర్చోండి' అంటూ మోహన్ ప్రక్కగదిలోకి దారితీశాడు.

'కావలిస్తే ఓ నిముషం కూర్చుంటాం కాని, మాకోసం కాఫీ ప్రయత్నం అదీ మాత్రం చెయ్యకండి — రేపు మాలతి బర్తుడే పార్టీకి పిలుద్దామని వచ్చాం' అన్నాడు మూర్తి.

'కాఫీ కలపటం పెద్దపనా ఏమిటి, రెండు నిముషాల్లో అయిపోతుంది. మీరు మాట్లాడుతూ వుండండి' అంటూనే వంటగదివేపు వెళ్ళబోయింది సావిత్రమ్మ.

'ప్లీజ్ — ఏమీ అనుకోకండి — ఇప్పు డేమీ తీసుకోగలిగే స్థితిలో లేం — మధ్యాహ్నం ఇంటిదగ్గరే దిట్టంగా టిఫినూ కాఫీ తీసు కుని బయలుదేరాం — ఆ తరువాత మా అమ్మాయి స్నేహితురాళ్ళ ఇళ్ళలో ఓ దగ్గర కాఫీ, ఓ దగ్గర టీ, మరోదగ్గర నిమ్మ రసం బలవంతాన్న తాగబోశాం. వద్దూ అంటే వినేవారు కాదు. ఆ విస్తారం భరించలేక తప్పనిసరిగా తీసుకోవాల్సి వచ్చింది' అని మూర్తి అంటూంటే

'అన్నిచోట్లా మర్యాదకి ఏదో ఒకటి తీసుకున్నవాళ్ళు మా ఇంట్లోనూ అలాగే తీసుకోండి' అన్నాడు మోహన్.

'లేదు మోహన్ — మరి బలవంతం చెయ్యకండి. ఇక్కడ మాకు ఆమాత్రం చనువు వుంది కనుకే స్వతంత్రంగా వద్దు అని చెప్పగలుగుతున్నాం...'

'ఇది మరీ బాగుంది — చనువూ స్వతంత్రం వున్నచోట ఏమీవద్దు అని చెప్పి కొత్తచోట మాత్రం వాళ్ళమాట చెల్లిస్తారన్నమాట' మోహన్ విస్మయంగా అన్నాడు.

'అంతేమరి — వాళ్ళ ఆతిథ్యాన్ని తిరస్కరించి వాళ్లనేదో అమర్యాద చేశాం అన్నట్టు అపార్థం చేసుకునేచోట తప్పని సరిగ తీసుకోవాలి. ఇంక మీ ఇంట్లో నంటావా, భోజనం వేళ్టికి వచ్చి నేనూ అన్నం తింటాను అని కంచం పెట్టుకుని కూర్చునే చనువూవుంది. ఇప్పుడు నాకేమీ వద్దు నేను ఏమీ తీసుకోను అని నిర్మొహ మాటంగా చెప్పగలిగే స్వతంత్రమూ వుంది.' అని మూర్తి అంటూంటే,

అందరూ నవ్వేశారు.

మరి కాస్సేపు కూర్చుని ఆ ఖబురూ ఈ ఖబురూ చెప్పి మూర్తి లేవాగ, 'ఆంటీ, రేపు మోహన్‌తో మీరుకూడ తప్పకుండా రావాలి.' అని సావిత్రమ్మకి చెప్పి, 'మీరు కూడ' అని సరళకి కూడ

### దధ్యమృత సౌజా

కావలసినవి:—

| | | |
|---|---|---|
| పుల్లటి పెరుగు | — | 2000 గ్రాములు. |
| పటిక బెల్లం | — | 400 గ్రాములు |
| అల్లపు రసము | — | 30 గ్రాములు |
| శొంఠి చూర్ణము | — | 15 గ్రాములు |
| జీలకర్ర చూర్ణము | — | 15 గ్రాములు |
| ఏలకుల చూర్ణము | — | 5 గ్రాములు |
| పచ్చ కర్పూరము | — | 2 గ్రాములు. |

తయారు చేసే విధానం:—

కర్పూరం తప్ప మిగతా అన్నింటినీ కలిపి బాగా పిసికి పలుచని గుడ్డతో వడగట్టి, వడగట్టిన రసములో 2 గ్రాముల పచ్చ కర్పూరం చూర్ణమును కలిపి సీసాలో గాని, జాడీలోగాని భద్రపరచుకోవాలి. ప్రతిరోజూ అరకప్పు పొద్దున తాగితే ఆరోగ్యకరము.

'దధ్యమృత సౌజా'ను ప్రతి నిత్యమూ సేవించడం వలన పైత్య వ్యాధులు హరించి రక్త పుష్టికి దోహదకారి అవుతుంది. మూత్ర కృచ్ఛ వ్యాధుల్ని, పైరోచనాల్ని — తగ్గిస్తుంది. వికారాల్ని పోగొట్టి బలాన్ని కలిగిస్తుంది.

—మూర్తిశ్రీ జయసౌజన్య

చెప్పి అందరిదగ్గరా సెలవు పుచ్చుకుని అన్నగారి వెంటనడిచింది మాలతి... సావిత్రమ్మా, మోహన్ వాళ్లవెంట వెళ్లారు గేటుదాకా — మూర్తి మోహన్ ఆఫీసు విషయాలేవో మాట్లాడుకుంటూంటే సావిత్రమ్మ మాలతితో అంది.

'రేపు మీ ఇంట్లో పార్టీ హడావిడి అయిపోయాక, ఓరోజు మధ్యాహ్నం ఎప్పుడయినా రా' కాస్సేపు కూర్చుని సరళా నువ్వూ కబుర్లు చెప్పుకుందురు గాని.' అని.

'అలాగే తప్పకుండా వస్తాను.' అని ఆవిడకి సమాధానం చెప్పి మోహన్‌తోకూడ మరోసారి చెప్పి అన్నగారి వెనక స్కూటరు ఎక్కింది మాలతి.

తలుపుకు తాళంపెట్టి మోహన్ వాళ్లు ఎగ్జిబిషన్‌కి బయలుదేరారు.

క్రొత్తగా ఇలాంటి ప్రదర్శనాన్ని చూస్తున్న సరళకి ఒక్కొక్క షాపూ ఓపిగ్గా చూపిస్తూ, వింతలూ విశేషాలూ వర్ణించి చెప్తూ కొత్తస్థలంలో ఇంత మంది జనంలో ఒక్క క్షణం తను కనుపించకపోతే సరళ భయపడి పోతుందేమో అన్నట్టు ఆమెని అంటిపెట్టుకునే ఉంటున్నాడు మోహన్.

ఆసక్తిగా, ఆనందంగా ఆ ఎగ్జిబిషన్ అంతా చూస్తూ మధ్యమధ్య కుతూహలంగా అతన్ని ప్రశ్నలువేస్తూ, ప్రక్కన అత్తయ్యవుంది అన్నసంగతి మరచిపోయి

## నేను మావాళ్లు...

నట్లు అతనితోనే కబుర్లు చెప్తోంది సరళ.

కొడుకూ, మేనగోడలూ అలా ఒకరి ప్రక్కన ఒకరు నడుస్తూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూంటే ముచ్చటగా వాళ్లనే చూస్తూ, ఏవేవో ఊహాలలో తేలిపోతూ ఇంచుమించు మౌనంగానే వాళ్లని అనుసరిస్తోంది సావిత్రమ్మ.

అందరూ బట్టల దుకాణాలదగ్గరికి వచ్చే సరికి ఆవిడ పాదాలు రక్కున ఆగిపోయాయి — ఆవిడ పిలుపు విని మోహన్, సరళ కూడ ఆగిపోయారు.

'ఈ షాపులో నీకు నచ్చిన చీర ఒకటి ఎంచుకో.' మేనగోడల్ని వుద్దేశించి అందావిడ.

'అత్తె నాకిప్పుడు చీర ఎందుకూ?' పుట్టెడు మొహమ్మాటం పడిపోయింది సరళ.

'మీ అమ్మా నాన్నా, నాకూ మోహన్‌కీ బట్టలూ అవీ ఇచ్చినప్పుడల్లా నేను తీసుకోలేదూ?' ఎప్పుడయినా ఇలా వద్దన్నానా?' సుస్మితంగానే మందలించింది సావిత్రమ్మ.

సరళ ఇంకేమీ మాట్లాడలేదు. ముగ్గురూ షాపుదగ్గరగా వెళ్లి నిలబడ్డారు. మోహన్ చెప్పినమీదట షాపు కుర్రాడు రకరకాల చీరలు లోపలి అద్దాల్లోంచి కూడ తీసి మడతలు విప్పి, చీరనాణ్యాన్నీ మన్నికనీ, రంగునీ, అంచునీ కూడ వర్ణించి చెప్తూ గుట్టగా పడేస్తున్నాడు; ముగ్గురూ మౌనంగా చూస్తూ నిలబడ్డారు. కాస్సేపటి తరువాత సావిత్రమ్మ అంది. 'ఏమ్మా వీటిల్లో నీకే చీర నచ్చలేదా?' అని.

'ఇంకా చాలా రకాలున్నాయి. చూడండి.' అన్నాడు షాపు యజమాని, నచ్చలేదు అన్నమాట ఆ అమ్మాయి నోటినుండి వచ్చేస్తుందేమో నన్నట్టు కంగారుగా.

అందులో ఏది తీసికోవాలో అసలు ఎంత ఖరీదులో తీసుకోవాలో నిర్ణయించుకోలేక బొమ్మలా నిలబడిపోయిన సరళ, ఆవిడ మాటతో కదిలి, 'నీ ఇష్టం అత్తయ్యా, నీకేది నచ్చితే అది నాకూ బాగనే వుంటుంది.' అంది.

'అయితే ఈ మబ్బురంగు చీర బాగుందేమో చూడు.' ముందున్న బట్టలలోంచి ఓ జపాన్ జార్జెట్‌చీర తీసింది సావిత్రమ్మ.

ఆ చీర కొంగువివర చిన్న లేబిల్ మీద వున్న ధరచూసి బిత్తరపోయింది సరళ.

'ఇప్పుడింత ఖరీదైన చీర ఎందుకత్తయ్యా. సాదాది ఏదైనా కానియ్యి.' అంది.

'చీర నచ్చిందేమో చెప్పమంటే. ఖరీదు సంగతి ఎవరడిగారు నిన్ను...ఏం, మోహన్ ఈ చీర బాగుండలేదూ...' అని ఆవిడ అంటూంటే.

'దీనికంటె ఆ రంగు బాగుంటుందమ్మా సరళకి.' అన్నాడు మోహన్ దూరంగా వున్న చీరని తియ్యమని షాపు కుర్రాడికి చూపిస్తూ.

అస్తమిస్తున్న సూర్యబింబపు ఎరుపు రంగులో చుట్టూ బెత్తెడు వెడల్పున బంగారపు రంగులో చమ్కీ లతలూ పువ్వులూవున్న అంచు, చీరనిండా కూడ అక్కడా అక్కడా చిన్నచిన్న పువ్వులున్నాయి — అంతకుముందు సావిత్రమ్మ చూపించిన చీరకంటె మరో పదిహేను రూపాయలు ధర ఎక్కువే.

'ఇది నచ్చిందా?' మాటవరసకి తల్లినీ, సరళనీ అడిగినట్టుందే కాని నిజంగా వాళ్ల అభిప్రాయం తెలుసుకోవాలని అడిగినట్టు లేదు అతడిధోరణి. అయినా బాగుండలేదు అనే ఆస్కారం లేకుండా ఆ ఇద్దరి కళ్లనీ ఆకర్షిస్తుకుంది ఆ చీర. ఇద్దరూ తృప్తిగా



తం పొగించారు — ఇంకాస్సేపు ఆగితే వాళ్ళు మనస్సు మార్చుకుంటారేమో, మరో షాపులో కూడ చూసివస్తామని వెళ్ళిపోతారేమో అన్నట్లు, వాళ్ళకి కాస్త పూపిరి తీసుకునే వ్యవధి అయినా ఇవ్వకుండా 'అమ్మగారికి ఈ చీర బాగుంటుంది సార్, దీనిమీదికి మేచింగ్ బ్లౌజ్ పీస్ చూపించమంటారా' అంటూనే ఇన్ని జాకెట్టు గుడ్డలు తీసి ముందు పడేశాడు ఆ షాపులో కుర్రాడు. అందరూ కలిసి ఆ చీరరంగుకి సరిపోయిన జాకెట్టు బట్ట సెలక్టు చేశారు. రెండింటికీ బిల్లు చెల్లించి ప్యాకెట్టు తీసుకున్నాడు మోహన్. తరవాత తల్లిచేతికి ఇచ్చాడు, ముగ్గురూ యింటికి తిరిగివచ్చారు.

(ఇంకా ఉంది)

# వారఫలం

## 16-6-1972 శుక్రవారం మొదలు 22-6-1972 గురువారం వరకు

**మేషం** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం** ఆదాయం కంటే హడావుడి అధికంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిధునం** వ్యాపారంలో సాటివారి పోటీ తగ్గుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య** అధిక వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి రాగలదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యతిరేకత యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా, ప్రయోజనముండదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**ధనుస్సు:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మకరం:** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోగలరు. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజన గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**కుంభం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**మీనం** ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**—మహేష్**

# మీ తలనొప్పి అంతా




# ఒకే ఒక సారిడన్‌తో

ట్రేడ్ మార్కు 'రోష్'

# మటుమాయమై పోతుంది

మీకు ఏ కారణము వల్ల తల నొప్పి వచ్చినా సారిడన్ దగ్గర వుంచుకోండి. మీకు తల నొప్పి, ఒళ్ళు నొప్పి, పళ్ళ నొప్పితో బాటు వుండే భారమును లేక అసౌఖ్యము కలిగిన రోజులలో వుండే బాధను పోగొట్టి, హాయి నవోత్సాహమును కలిగించుటకు సారిడన్ ప్రత్యేకంగా సూత్రీకరింపబడినది. అదే సారిడన్ ప్రత్యేకత-అది మిమ్ము చురుకుగా, ఉత్సాహముతో వుంచును.

**సారిడన్ ఉపశమనమును, నవోత్సాహమును, హాయిని కలిగించును**




ఒకే ఒక సారిడన్ బిళ్ళను
'రోష్' తయారీ




### జరిగిన కథ

మాధవరావు ఆ వూళ్ళోకి స్కూలు మాష్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యపోతే అతను కుక్కకాటుకు గురి అయ్యాడు. శాంతమ్మగారు అతన్ని యింటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆమె తండ్రి అభిప్రాయం ప్రకారం అతను ఆ యింట్లోనే వుండిపోవలసి వచ్చింది. ఆ రోజున తూలుతూ వచ్చాడు మాధవరావు. అతనుకూడా తన తండ్రిలాగా తాగుబోతు అయినందుకు విచారించింది అనురాధ. అతనికి హితబోధ చేసింది. మాధవరావు తప్పు తెలుసుకున్నాడు. ఆతర్వాత అనురాధ అతనికి మరింత చేరువై పోయింది. ఆ తర్వాత అతనిదగ్గర చదువు కోవడం ఆరంభించింది. రంగరాజు కొడుకు రాజారావు ఊరికి ప్రెసిడెంటుగా నెగ్గాడని ఆమె చాలా బాధపడింది. మాధవికి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాజారావు రాధని నిర్బంధించాడు. మాధవరావుకు సంబంధించిన ఒక రహస్యాన్ని వెల్లడించాడు. రాధ నమ్మలేదు. రాజారావు అత్యాచారం చెయ్యబోగా ఆమెకి స్పృహతప్పింది. మాధవరావు ఆమెని రక్షించాడు. దెబ్బలుతగిలిన మాధవరావు రాధ సపర్యలో కోలుకుంటాడు. మాధవరావు తల్లి విషాదగాథ రాధని కలచి వేస్తుంది. శశి కళతో తన పరిచయాన్ని రాధకి వివరిస్తాడు మాధవరావు.

---

## 17

నాన్నగారి ఆరోగ్యం దిగజారటం, ఇంటినిండా చేరిన దుష్టగ్రహాలు మా ధన మాన మర్యాదల్ని దోచుకోవటం... ఇవేమీ తెలియని చిరుత వయస్సులో నేనుంటే—ఏవీ పట్టించుకోని కులాసా జీవితం గడుపుతున్నాడు మా అన్నయ్య. కావాలన్న డబ్బు ఇచ్చి మన్మల్నందర్నీ నల్లమందు పెట్టినట్టు చేసాడు లోకనాథం. మేమిలాగునే ఉంటే కొన్ని రోజుల్లో వీధుల్లో నిలబడే పరిస్థితి ఏర్పడక మానదు, అది గ్రహించికూడ నేను పైకి ఏమీ అనలేని అశక్తుడినయ్యాను. దూరదృష్టి ఉన్నా వ్యవహారం చక్కబెట్టగలిగే వయస్సు లేకపోయింది నాకు. నాలోనే మథన పడవల్సి వచ్చింది! ఆ తరువాత ఎవరైనా మా కుటుంబాన్ని గురించి హేళనగా మాట్లాడినా నేను తలవొంచుకునే వాడిని. ఏ తప్పు చేయని నేను నిందలు పడవల్సి వచ్చింది.

'...అన్నపూర్ణమ్మ తన కూతుర్ని అదుపులో పెట్టివుంటే ఆ అమ్మాయికి ఎప్పుడో పెళ్ళయ్యేది బాబూ!...' అన్నాడు తాత, అతని మాటల్లోని పూర్తి అర్థం ఆ రాత్రి నాకు తెలియలేదు. కాని ఒకనాడు నాకు మరికొన్ని చేదైన నిజాలు తెలిసేసరికి నా చుట్టూ ఎంత విషవలయం చుట్టుకొనివుందో అర్థమయింది!

నాకు తెలిసిన విషయాలు మనస్సులో దాచుకొని మథనపడలేక వేణుకి చెప్పాను. ఆ ఒంటరి తనంలో మిత్రుని ఓదార్పే ధైర్యాన్నిచ్చింది నాకు. అతని సలహామీదనే ఒకసారి అన్నయ్యతో మాట్లాడాలని నిశ్చయించుకున్నాను. అన్నయ్యంటే నన్నెప్పుడూ చేరదీయలేదుకాని నేను రక్త సంబంధాన్ని ఎప్పుడూ అవమానపరచి మాట్లాడలేదు. కుటుంబ పరిస్థితి గురించి అన్నయ్యతో చెప్తే లోకనాథంవల్ల మేమెటువంటి నికృష్ట స్థితిలో ఉన్నామో వాడికి తెలుస్తుందని నేనాశించాను. అన్నపూర్ణమ్మా పై అభిమాన వ్యామోహంలోపడి తన పరిస్థితిని అన్నయ్య తెలుసుకోలేక పోయాడని నేను నమ్మాను.

అందువేతనే ఒకనాడు రాత్రి అంతా నిద్రపోయాక వాడి గదివైపు వెళ్ళాను. తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి. సందులోంచి వెలుగు సన్నగా బయటికి పడుతోంది. తలుపుమీద చెయ్యివేసి నెమ్మదిగా నెట్టాను. కాని, లోపల గడియవేసి ఉంది. తలుపు తట్టితే ఎవరైనా నన్ను గుర్తిస్తారన్న శంకతో నిలబడిపోయాను. ఏమైనా అన్నయ్యతో మాట్లాడాలన్న ఆతృత ఒకమూల వేధిస్తోంది. ఏమీ పాలుపోక నిలబడివున్న నాకు అదే గదిలోంచి మాటలు వినిపించి ఉలిక్కిపడ్డాను.

గుండెలు చేతబట్టుకొని తలుపుదగ్గరగా వెళ్ళి సందులోంచి చూడాలని ప్రయత్నించాను. ఏమీకనిపించ లేదు. అన్నయ్యగొంతు స్పష్టంగా వినిపించింది. రెండవ గొంతు స్త్రీ స్వరం! అర్ధరాత్రివేళ అన్నయ్య గదిలో ఆడగొంతు! నా ఒళ్ళు భయంతో గగుర్పొడిచింది. అదేవిధమైన ఆవేదనో నాకర్థం కాలేదు.

నేనూ ఊహించిన దానికంటె అన్నయ్య పతనమయ్యాడు! నా మనస్సు వికలమై పోయింది. బాధతో నాగదికి వచ్చేసాను. వాడితో మాకుటుంబ పరిస్థితి గురించి మాట్లాడవచ్చని, భవిష్యత్తు దుఃఖభాజనం కాకుండ చూసుకోవచ్చని ఎంతో ఆశించి వెళ్ళిన నాకు మరింత బాధ ఎదురయింది.

ఇంత చిన్నవయస్సులో విలాస జీవితానికి అలవాటు పడితే ఇకముందు అన్నయ్యకూడ నాన్నగారివలె సర్వభ్రష్టుడవుతాడు! దీనికి పరిష్కార మార్గమేమిటి? నాకు దారిచూపు భగవాన్—అని ఎన్నో విధాల ఎన్నో రాత్రిళ్ళు నిద్రలేక నేను ఆలోచనలతో గడిపాను.

ఈ విషయం వేణుకి చెప్పటానికి సిగ్గు పడ్డాను. అతనిపై ఎంత విశ్వాసమున్నా 'నా అన్న ఇలాంటి బలహీనుడ'ని చెప్పటం నా కిష్టం లేకపోయింది.

నేనింటి విషయాల గురించి తక్కువగా మాట్లాడటం వేణు గుర్తించినట్లున్నాడు. మీ అన్నయ్యతో మాట్లాడావా మధూ !' అని ఒకనాడడిగాడు.

నేను గతుక్కుమన్నాను. 'లేదు వేణూ! ఇంతవరకు సమయం దొరకలేదు...' అన్నాను. నాకోసం కాకపోయినా అన్నయ్య కోసమయినా ముఖాముఖీగా కొంత మాట్లాడటం అవసరమని అనుక్షణం అనుకుంటూనే ఉన్నాను. కాని, అన్నయ్య నాకా అవకాశం ఇవ్వలేదు.

పగలు వాడింట్లో క్షణం ఉండడు. ఏ వేళప్పుడో తిండి తిని వెళ్ళిపోతాడు. కాలేజీ, స్పోర్ట్సు, పిక్నిక్స్...ఏదో ఒక దానితో ప్రతిరోజూ బిజీగా ఉండేవాడు. నాకు శలవురోజు తప్ప ఇటువంటి స్వవిషయాల గురించి ఆలోచించటానికి తీరికయ్యేదికాదు. అప్పుడయినా శశికళ నన్ను వదలి ఉండేది కాదు. ఇంక వాడితో మాట్లాడాలంటే రాత్రివేళ తప్ప వీలెక్కడిది?

అనేక రాత్రులు అన్నయ్యతో మాట్లాడ దామని ప్రయత్నించాను. కాని, ఎప్పుడు వెళ్ళినా వాడిగది మూసి వుండటం...గదిలో గుసగుసలు వినిపించటం జరిగేది. నిరాశగా తిరిగి వచ్చిపడుకునేవాడిని.

నాలో అనేక ప్రశ్నలు వేధించాయి. ఇంత ధైర్యం అన్నయ్యకెలా వచ్చింది? ఆమె రహస్యంగా రాకపోకలు ఎలా జరప గలుగుతోంది? ఇంతకీ ఆమె ఎవరు?

ఒకనాడు ఏమయినా ఆమె ఎవరో తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాను. సరిగా రాత్రి పదకొండున్నరకి అన్నయ్య గదివైపు నడిచాను. ఎప్పటిలా, నాకు వాళ్ళ గుసగుసలు వినిపించసాగాయి. తోటలోంచి వెనక వైపుకి వస్తే కిటికీగుండా గదిలో ఎవరున్నది తెలుసుకో వచ్చని నాకు గుర్తుకు వచ్చింది.

ముందు గుమ్మంలో వాచ్‌మన్ ఉంటాడు. వెనకవైపు తోట చుట్టి రావాలి. సాహసం చేసాను. పిల్లిలా అడుగులు వేస్తూ మొక్కల్ని తప్పించుకుంటూ ఆ కిటికీకి దగ్గరగా ఉన్న వేపచెట్టు ఎక్కాను. కిటికీ వైపు వొంగివున్న కొమ్మమీదకు ప్రాకాను కిటికీ పై తలుపులు తెరచి ఉన్నాయి. అక్కడి నుంచి గదిలోని దృశ్యం స్పష్టంగా కని పిస్తోంది.

అన్నయ్యను తన కౌగిట్లో ఉక్కిరి బిక్కిరి చేస్తోంది ఆమె. క్షణంలో గుర్తు పట్టాను. నాతలపై పిడుగు పడి



వచ్చుతుంది !

ప్రతి జాతిలోను తన్నొక్కర్ని తెలుసుకునే విచక్షణా జ్ఞానం జన్మ సంస్కారం వల్లనే కలుగుతుందని నాకు చిన్నప్పటి నుంచీ నమ్మకం. అటువంటి దృశ్యం చూడటమే ఒక మహాపాపంగా భావించిన నాకు ఇంగిత జ్ఞానం కోల్పోయి తన్నుతాను దగ్ధం చేసుకుంటున్నవాడు నాకు అన్న ఎలా అయాడో అంతు పట్టలేదు. తర్వాత బెనారస్‌లో ఎమ్. ఏ. చదువుతున్నప్పుడు ప్రొఫెసర్‌తో చర్చించినప్పుడు కాని నా ఈ సందేహం తీరలేదు.

వయస్సులో వున్నప్పుడు అన్నాచెల్లెళ్ళైనా ఏకాంతంగా ఎక్కువ కాలం గడపటం ప్రమాద హేతువని ... రక్తసంబంధాన్ని, జన్మసంస్కారాన్ని, విచక్షణ జ్ఞానాన్ని—అన్నిటినీ కూలద్రోసి మహాపాపం చేయించగల శక్తి యౌవనంలో

## రాగధార

ఉందని ఆయన నాకు చెప్పారు.

గొల్లభామ మొదలు గోవిందుని వరకు ప్రతి ప్రాణిని ప్రేమించి పూజించే పవిత్ర భావం నాలో పాదుకొల్పింది నా పెంపుడు తల్లి అంటే అమ్మ. ఆమె క్రమశిక్షణలో పెరిగిన నాకు విచక్షణా జ్ఞానం ఏర్పడింది ...కనుకనే రక్తసంబంధాన్ని అనుమానించలేక పోయాను. ఆనాటి పాపదృశ్యం నా కళ్ళ పడకపోయివుంటే నేను ప్రొఫెసర్ వాదనను నమ్మి ఉండేవాడిని కాను. కాని, చూసింది నేను నమ్మవలసి వచ్చింది! అన్నయ్యను భ్రష్టుడిని చేసింది ... తాను సర్వనాశనమైంది అంతవరకు నేను అక్కయ్యగా గౌరవించిన రజని!

* * *

నేను ఉలిక్కిపడ్డాను. అంతవరకు ఉగ్గబట్టుకుని వింటున్న నాకు అతని ఆఖరి మాట వినేసరికి ఒళ్ళు జలదరించింది! 'రజని'?

'అవును రాధా! నువ్వు నమ్మలేవు. కళ్ళారా చూసికూడ నేను నమ్మలేకపోయాను. తనకంటె మూడేళ్ళు చిన్నవాడితో వావి వరసలు తప్పి ఒక స్త్రీ చరిస్తుందంటే ఎవరూ నమ్మలేరు. కాని జరిగేది నిజం! ఈ విషవలయంలో పుట్టి పెరిగిన దురదృష్టవంతుడిని రాధా! చిన్నోసారు నీకు నా వివరాలు చెపుదామనుకొని కూడా ఈ పతితుల గాధని ఏమని చెప్పనని వెనక్కు తగ్గిపోయాను ... ఇటువంటి విషయాలు ఎవరితో చెప్పుకోగలను? చెప్పుకొన్నా ఎవరి సానుభూతి లభిస్తుంది? ఇందరి పతితుల మధ్య పుట్టి పెరిగిన నేను పవిత్రుడినని చెప్తే ఎవరైనా నమ్ముతారా? నమ్మరు ... నమ్మలేరు.' అతని కంఠం గద్గదికమైంది.

నా మనస్సు నీరైపోయింది. 'ఛ! మిమ్మల్ని మీరు చిన్నపరచుకుంటారెందుకు? అందరికీ ప్రీతి పాత్రమైన పద్మం కూడ బురదలోనే పుట్టిందని మీరొకసారి అనలేదూ?'

'అవును. అందుకనే జీవితంపై మమకారం పెంచుకొని అందరిలోను మనిషిగా బతకాలని ఉవ్విళ్ళూరాను రాధా! కాని, నా కడుగడుగునా పరీక్షలే ఎదురయ్యాయి. నన్ను మొండివాడిని చేసాయి. నా హృదయాన్ని రాయిగా మార్చేసాయి... నేనీ ఊరు వచ్చి ఉండకపోతే నా జీవితమార్గం మరెలా ఉండేదో చెప్పలేను కాని, రాయిగా మారిపోయిన నా హృదయం తిరిగి నీ వల్లనే కరిగి ద్రవించింది రాధా!...'

నేను మౌనంగా అతని వంకీల జుట్టుని నిమురుతూ, అతను అంతక్రితమే చెప్పిన మాటలు మననం చేసుకుంటూ ఉండి పోయాను.

కొంతసేపటికి, 'పోనీ మిగిలింది రేపు చెప్పండి.' అన్నాను.

'లేదు రాధా! నిన్ను ప్రశ్నలతో వేధించాను ఇంతవరకు ... శశికళ నానుండి ఎలా దూరమయింది నీకు చెప్పేగాని నాకు తృప్తిగా ఉండదు...'

ఆవిధంగా చిన్నతనంలో నా కళ్ళబడిన అసహజమైన దృశ్యాలు నా తండ్రిమీద నా

అన్నమీద అసహ్యాన్ని కల్గించాయి: దానికి తోడు స్త్రీ ప్రవృత్తికే దూరంగా ఉండా లన్న విచిత్రభావాన్ని కల్గించాయి.

కాని, అప్పటికే శశికళతో కలిగిన అను బంధం నా మనస్సును ద్వైధీభావంలో పడ వేసింది. ఉద్రిక్త స్వభావి అయిన శశికళ నాకు నిజంగా ఒక సమస్య అయింది. ఆమెను వదులుకోలేను. దగ్గరకు రానివ్వ లేను. ఏం చెయ్యాలో అర్థమయ్యేది కాదు.

లోకనాథం దుశ్చర్యలు విడమర్చిచెప్పిన శంభుతాతే శశికళతోటి నా అనుబంధాన్ని హర్షించాడు. ఇక శశికళను ఎలా దూరం చేసుకోగలను? అయినా, నా మనస్సులో చెలరేగుతున్న దావానలాన్ని ఆర్పివేసుకోలేక మనస్సు కిష్టంలేకపోయినా ఆమెతోటి అతి చనువును తగ్గించుకుంటూ వచ్చాను.

కొంతకాలానికి నా తరహాను కని పెట్టింది శశికళ. 'బావా!... నేనంటే నీ కిష్టంలేదా? అస్తమానం ఏదో చదువు కుంటూ వ్రాసుకుంటూ కూర్చుంటావు. నాతో మాట్లాడవేం?...నేనల్లరి చేస్తున్నా ననా? నీమాట వినటంలేదూ?' అంటూ వాపోయేది.

నా మనస్సు జాలితో నిండిపోయేది. 'అదికాదు శశీ! మనమిప్పుడు చిన్నపిల్లలం కాదు కదా! పై క్లాసుల్లోకి వచ్చాము. బాగా చదువుకోకపోతే ఎలా?...' అని 'మాట తప్పించేసేవాడిని.

అప్పటినుంచి నా మనస్సులో ఒక ఆలో చన మెదిలేది. శశి, నేను పెద్దవాళ్ళమవు తాము. లోకనాథం పెళ్ళిబేరాలాడుతాడు. కాని, అతని కూతురుగా శశికళను చేసు కోవటంకంటె అవమానం మరోటి లేదు. పెద్దవాడినై నా కాళ్ళపై నిలబడి శశికళ తన పెంపుడు తల్లిదండ్రుల్ని వదలి వచ్చేలా చేసుకొని అప్పుడు నేను పెళ్ళి చేసుకోవాలి...అంతవరకు శశికళను నొప్పించ కుండ నా చదువు కొనసాగించుకోవాలి.

ఇలా నిర్ణయించుకొని అంత చిన్న వయస్సులోనే భవిష్యత్తుకో మార్గాన్ని నిర్మించుకున్నాను.

కుటుంబ విషయాల్ని గురించి అన్న

# రాగధార

య్యతో మాట్లాడదామనుకున్న కోరిక ఆనాటి దృశ్యం చూసాక నాలో అణగారి పోయింది. వేణుతో అదేమాట చెప్పాను. 'మా అన్నయ్య నాకు కలిసిరాడు వేణూ! కొన్నిరోజుల్లో మేమంతా చెట్టుకు పుట్టకు తలోకళ్ళం దూరమయ్యే పరిస్థితులు ఏర్పడతాయి. ఇక అప్పుడు నాకీ చదువు తప్ప మరే ఆధారం ఉండదు. ఇక అన్నయ్య అని పిలుచుకోవలసిన ఆ మూర్ఖుడిని దేవుడుకూడ బాగుచేయలేడు ... అంతే వేణూ!' అన్నాను.

ఒకనాడు శంభుతాత వెగటైన వార్త ఒకటి చెప్పాడు.

'...నేను మొదటినుంచీ అంటూనే ఉన్నాగా బాబూ!— కూతురు బరితెగించి పోడానికి కారణం అన్నపూర్ణమ్మేనని. ఆ అమ్మాయి ఒళ్ళుపై తెలియకుండ కాలేజీ స్నేహితులతో షికార్లు, పిక్నిక్‌లు తిరుగుతుంటే ఈ అమ్మకు చీమయినా కుట్టలేదు. ఇదిగో ఇప్పుడు చేసుకున్న పాపం పండింది...'

నా కర్థంకాక, 'ఏం జరిగింది తాతా?' అని అడిగాను.

'ఆడపిల్ల జీవితం అరిటాకులాంటిది. పెద్దవాళ్ళు గ్రుడ్డివాళ్ళయితే పిల్లల గతి ఇంతేమరి! ఎవడో మోసం చేసాడు బాబూ! రజినమ్మకు కడుపుటా...'

శంభుతాత మాటలకులిక్కిపడ్డాను. తెలియరాని మహాపరాధమేదో నేను చేసినంత బాధ పడ్డాను. వాళ్ళ దుశ్చర్యలు ఇంత పాపానికి దారి తీస్తాయని నాకా వయస్సులో తెలియదు. కాని, ఆవార్త విన్నాక నా మనస్సు వికలమైపోయింది.

రజని బ్రతుకుని ఎవరో పాడుచేసారని తాత అంటుంటే అంత బాధలోను నాకు నవ్వు వచ్చింది. తన్ను తాను నాశనం చేసుకొని తనకంటె చిన్నవాడిని భ్రష్టుడిని చేసింది ఆమె. ఆ సత్యం నా దురదృష్టవశాత్తూ నా కొక్కడికే తెలుసు. జరిగింది వింటే రజనిని ప్రపంచం అంతా ఇంతకన్న అసహ్యించుకుంటుంది. ఆమె తన కంటిని తన వ్రేలితోనే పొడుచుకుంది. ఇక నేను నిజం చెప్పటమెందుకు? ఆ విషాన్ని నాలోనే అణచుకున్నాను.

ఎంత బెదిరించినా తల్లితో రజని నిజం చెప్పలేదు. ఆ వార్తవిని ఏదో ఎక్స్కర్షన్ వంకతో అన్నయ్య నెల్లాళ్ళు ఊరువదలి వెళ్ళిపోయాడు. తన జీవితమే పాపపంకిలం చేసుకున్న అన్నపూర్ణ కుమార్తె అపరాధానికి పైకి నోరెత్తలేకపోయింది. లోకనాథంగారి ధర్మమా అని ఆవిడకో ఉపాయం తట్టింది. మూడోకంటి వాడికి తెలియకుండా ఏదో మందు తెప్పించి రజని కిచ్చింది. ఆ భ్రూణహత్యలో వాళ్ళకు మనశ్శాంతి కల్గింది. అలవాటయిన పాపకృత్యాల సంఖ్యకు మరొకటి చేర్చుకున్నారు వాళ్ళు. ఒక్కొక్కటే వింటున్నకొద్దీ నాకు జీవితంపైనే అసహ్యం పుట్టసాగింది. ఆరోజుల్లో వేణు స్నేహమే నన్ను రక్షించింది అని చెప్పక తప్పదు. ఏది జరిగినా చలించని రాయిలా తయారయ్యానంటే అతను పెట్టిన భిక్షే అని చెప్పాలి.

కూతురు చేసిన పాడుపని తెలిసి కళ్ళు తెరిచింది అన్నపూర్ణ. ఏదయినా సరే ఏదో ఒక సంబంధం చూడమని అన్నగారిని బ్రతిమాలింది. ఇదే అదనుగా తీసుకొని 'కంపెనీలు రెండూ నాన్నగారిచేత అమ్మించేలా చూడమని'ని లోకనాథం ఆమెకు నూరిపోసాడు. అతని బెదిరింపులకు లొంగిపోయిన అన్నపూర్ణ నాన్నగారిని ఒప్పించటానికి ప్రయత్నించింది. అప్పటికే అనేక రోగాలతో దాదాపు మంచం మీదనే బ్రతుకు వెళ్ళదీస్తున్న నాన్నగారు ఆ వయస్సులో అన్నపూర్ణ తప్ప తనను చూసేగతి లేదనుకున్నారో— ఏమో ఆవిడ కోర్కె నెరవేర్చారు.

కాగితాలపై సంతకాలయి పోయాయి. రెండు కంపెనీలు మా ఆధీనం నుంచి పరులపాలయ్యాయి. నాన్నగారి మీద తన ప్రభావాన్ని చూపేలా లోకనాథం మరొక తెలివైన పని చేసాడు. అప్పులన్నీ తీర్చేయగా మిగిలిన నలభైవేల రూపాయలతో ఒక ఫ్యాన్సీషాపు తెరిపించాడు. అంత డబ్బు చూపించి మరొక మంచిపని చేసాడంటే నిజంగా అతడు శ్రేయోభిలాషి కాడంటే ఎవరు నమ్మగలరు? కాని, కంపెనీల అమ్మకంలో తానెంత కమీషను తీసుకున్నాడో దేవుడికి తెలియాలి.

అన్నపూర్ణ అభిమానం సంపాదించుకోవటానికి ఎవరిద్వారానో ప్రయత్నించి గుంటూరునుంచి ఒక పెళ్ళి సంబంధం తీసుకువచ్చాడు. ఏం చెప్పాడో ఏం చేసాడో రజనికి పెళ్ళి నిశ్చయమైంది. మాసముండగానే ఆమె పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఏకలతలు లేకుండ ఆమె తర్వాత జీవితంలో స్థిరపడితే అంతేచాలని అంతా సమాధానపడి ఉంటారు.

రజని వెళ్ళిపోయాక అన్నయ్య మరి పాడయిపోయాడు. మధ్య మధ్య అన్నపూర్ణమ్మతో తగవులాడి వాడు డబ్బు పట్టుకు వెళ్ళటంకూడ జరిగేది. నాన్నగారు కలగజేసుకొని తిట్టటం, వాడదేమీ లెక్క



చేయకుండా తన విలాసాల్లో మునిగి ఉండటం నాకు తెలుసు. మొదట్లో మా రెండో మేడనుంచి వచ్చే అద్దె సొమ్ము లోకనాథం వసూలుచేయటానికి వెళ్ళే సరికే అన్నయ్య ఆ డబ్బు కాజేస్తూండేవాడు. కాని, తన తెలివితేటలతో లోకనాథం అన్నయ్యను మళ్ళీ బుట్టలో వేసుకున్నాడు. అప్పటికే ఇంటరు ఫెయిలయి దిమ్మరిలా తిరుగుతున్న అన్నయ్యకు... 'ఈ చదువులు ప్రయోజనం లేదు. పాన్ షాపు వ్యవహారం చూసుకో! వ్యాపారంలోనే నీలాంటివాడు పైకిరావాలి...' అని నచ్చచెప్పటంతో వాడు ఏకళనున్నాడో లొంగిపోయాడు.

కాని. మా పేరన నామకహా మిగిలిన ఈ షాపును అన్నయ్యను చూసుకోమని చెప్పటంలో లోకనాథం మూడు ఆశయాల్ని సాధించాడు. ఇతరులకి తానెంతో త్యాగధనుడని, యజమానికి శ్రేయోభిలాషినని అనిపించేలా తాను మానేజరుగా మాత్రమే వ్యవహరిస్తూ లాభాలు పెద్ద అంకెల్లోకి తెచ్చి చూపగలిగాడు. ఇటు పెద్దకొడుకుకి కుదురు నేర్పిన వ్యక్తిగా నాన్నగారివద్ద మన్ననపొంది తాను స్వాహాచేసినదాన్నిగురించి ఆరా రాకుండా చూసుకున్నాడు. తాను సంపాదించిన భూముల్ని అభివృద్ధిలోకి తీసుకు రావటానికి తీరిక చేసుకోగలిగాడు. ఇక తనకుమార్తె బతుక్కోదారి చూపిన అన్నగారంటే అన్నపూర్ణకు గురి ఏర్పడింది దుర్నీతిని అవలంబించాడే కాని అతడు చాల తెలివైనవాడు. అతడే తలుచుకుంటే మేమంతా కలిసి వుండటమే కాకుండ నాతల్లి చిన్నవయస్సులో అటువంటి దుర్మరణం పాలయి వుండేది కాదు. మా జీవితాలు అమోఘంగా ఉండేవి. అలా అనుకున్నప్పుడు నాలో అతనిపై అసహ్యం, ప్రతీకార వాంఛ ప్రజ్వరిల్లుతాయి.

సరే, మా హైస్కూలు చదువు అయిపోయింది. నా కిష్టమయిన లెక్కల గ్రూపు తీసుకున్నాను నేను. తనకు తనకు మెడిసిన్ చదవాలని ఉందని బయాలజీ తీసుకున్నాడు వేణు. వ్యాయామం చేసిన మా శరీరాలు ఆకర్షణీయంగా తయారయ్యాయి, మేమిద్దరం కాలేజీలో తిరుగుతుంటే అంతా కృష్ణార్జునులని — ఆంటోనియో బెస్సానియోలని—రకరకాల—పేర్లతో పిలిచేవారు. మా గ్రూపులు వేరవటంతో తరగతులు మాత్రం మారిపోయాయి. కాని, తక్కిన సమయాల్లో విడిచి ఉండేవాళ్ళం కాదు. తీరిక వేళల్లో అతనికి ఆటలపైన, నాకు చిత్రరచనపైన మక్కువ కలిగేది, వా

చిత్రాలంటే వేణుకి వింతో అభిమానం. నాకు తెలియకుండ నా చిత్రాలు అనేక మందికి చూపించి నేను కోరుకోని పబ్లిసిటీకి తెచ్చాడు. ఆఖరికి నా చిత్రాలన్నీ నాకు తెలియకుండ కాలేజీ ఉత్సవాల్లో ఆతడు ప్రదర్శించాడు.

నాకు కోపంవచ్చి. 'ఇక ముందు నీకెప్పుడూ నా చిత్రాలు చూపించనురా వేణూ!' అన్నాను.

అతను ఫక్కున నవ్వుతూ, 'నువ్వు చూపించే దేమిటోయ్! నేనే తీసుకుపోయి అందరికీ చూపిస్తాను. నామధూ ప్రతిభను చాటి చెప్పుతాను... నా ఇష్టానికెవరూ అడ్డు రాలేరు' అన్నాడు.

నాబింకం సడలిపోయింది. వాత్సల్యంతో అతన్ని కౌగలించుకున్నాను. చిన్ననాటి ఆ మధుర ఘడియలు మరెప్పటికీ రావు, ఇప్పుడు ఉద్యోగులమై దూరమైపోయాక అస్మృతులు మాత్రమే మిగిలాయి!

తరచు రజని డబ్బు పంపమని తల్లికి వ్రాస్తుండేది. ఈవిడ పంపుతుండేది. కాని, ఆమె ఎప్పుడూ ఇక్కడికి వచ్చేది కాదు. ఆమెకు కావల్సింది డబ్బు...వీళ్ళకు

## రా గ ధా ర

కావల్సింది సంసారం గుట్టు. ఆ రెండూ నెరవేరాయి...తానే అడపా తడపా వెళ్ళి కూతుర్ని చూసి వచ్చేది అన్నపూర్ణ. ఇవేమీ తనకు తెలియని వాడిలా అన్నయ్య వ్యాపారంలోకి దిగిపోయాడు, మరి వాడికి కూడ వ్యాపారం పై ఆసక్తి కలిగిందో ఏమో పూర్తిగా బిజినెస్ మేన్ అయిపోయాడు, దానితో మా ఇంటి చరిత్ర మరొక మలుపు తిరిగింది!

లోకనాథం అంచనాల్ని మించిపోయాడు అన్నయ్య. ఏదో 'సేల్స్‌మేన్' లా పనికి వస్తాడనుకున్న అన్నయ్య వ్యాపార రహస్యాలు తెలుసుకోవటమే కాకుండ లోకనాథం గుట్టు మట్టులన్నీ తెల్సుకున్నాడు. దానితో అన్ని రహస్యాలు బయట పడ్డాయి.

నాన్నగారి దగ్గర ఒకనాడు అన్నయ్య ఈ ప్రస్తావన తెచ్చాడు. పాతికేళ్ళనాడు ఎంత అజ్ఞానంతో ఉన్నారో అంత అజ్ఞానంతోనే ఉన్నారు ఆయన! తన ఆస్తి ఎంతో తనకే తెలియని దుస్థితి ఆయనది. ఏదో ఇన్ని ఎకరాల భూములు, ఇన్ని కంపెనీలు; ఇన్ని మేడలున్నాయని ఆయనకు తెలుసు కాని వాటిమీద ఇంత ఆదాయం వస్తుంది ... జాగ్రత్తగా ఉంటే ఇంత ఆదా చెయ్యవచ్చు అని ఆయన ఎప్పుడూ ఆలోచించలేదు. సరే, ఇక విలాసాలలో మునిగిన వాళ్ళ కిటువంటివి పట్టవు కదా! అందుకనే. అన్నయ్య వేసిన ప్రశ్నల కొక్కదానికీ ఆయన సమాధానం చెప్పలేక పోయారు. దానితో లోకనాథం చేసిన అన్యాయాలన్నీ వరసగా బయట పెట్టాడు అన్నయ్య. నాన్నగారికి కనువిప్పు కలిగింది. ఆయన రుద్రులై పోయారు. వెంటనే లోకనాథాన్ని పిలిపించి నోటికి వచ్చినట్లు తిట్టారు.

ఆ సమయానికి నేనింట్లోనే ఉన్నాను. నాన్నగారెన్ని తిట్టినా లోకనాథం మాటాడలేదు. శిలాప్రతిమలా నిలబడి పోయాడు. దాదాపు నాన్నగారి వయస్సే ఉంటుంది అతనికి.

'...ఇన్నాళ్లనుంచి మీరు మా బాగు కోరేవాళ్ళని మిమ్మల్ని గౌరవించాము. మీరింత మోసం చేసారని నాకు తెలియదు. నాన్నగారి మాటలకి సమాధానం చెప్పరేమండీ లోకనాథంగారూ!' అన్నాడు అన్నయ్య మండి పడిపోతూ.

లోకనాథం జిత్తులమారి అని మరోసారి ఋజువు చేసుకున్నాడు. అతని కంఠంలోని ప్రశాంతత నాకు అసహ్యమనిపించింది.

'...నేను మోసం చేయాలనుకుంటే నీకీవేళ ఫాన్సీషాపు కూడ మిగిలి ఉండేది కాదు. పాతికేళ్ళనుంచి మీ యింట్లో అడ్డమైన చాకిరీ చేసినందుకు నాకీమాటలు రావల్సిందే నాయనా! అనండి పడ్డవాడెప్పుడూ చెడ్డవాడు కాదు...'

'మా కళ్ళు మూసుకు పోయినంతకాలం మీరేమన్నా నమ్మామండీ! కాని, ఈవేళ మాక్కాకుండా పోయిన కంపెనీలు రెండూ వేలమీద లాభం తీస్తున్నాయంటే ఇది వరకు ఎందు కమ్ముకోవల్సి వచ్చిందో చెప్పరేం మరి?' అన్నాడు అన్నయ్య వ్యంగ్యంగా.

'నీకు నాకు కంఠశోష అక్కర్లేదు బాబూ! మీ నాన్నగారి డబ్బు అవసరాలేవటుంటివో...మీ ముచ్చట లెటువంటివో ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఇన్నేళ్ళ మీ అవసరాలన్నిటినీ తీర్చి ఈనాటి కింతయినా మిగల్చటాని కెవరు కారకులో నీకు బాగా అర్థమవుతుంది. ఏమయినా

## ఎండదొరా! మండిపడకు

ఎండదొరా !
మండిపడెద వెందుకు?
ఎవరి మీద నీకు కోపం?
పగటి దొంగల మీదనా
పాపాత్ముల మీదనా?
ధర్మ వేషధారుల మీదనా
ధనికులైన లోభుల మీదనా?

స్వలాభమే లక్ష్యమైన
రాజకీయ వాదుల మీదనా?
పదవీ వ్యామోహం కొద్దీ
పాపభీతి దైవ భీతి వదిలి
ప్రజాక్షేమం విస్మరించి
పాడు పనులకు పాల్పడే
పరరూప రాక్షసుల మీదనా?
ఎవరిమీద నీకు కోపం ?
ఎందు కింత మంట?
ఎండదొరా
చూడు చూడు భువిని
బీటలు పడ్డ భువిని.

ఎండిపోయిన చెరువులు
పంట కాల్వలు, బావులు,
వాడిపోయిన కూర పాదులు
కాంతి తరిగిన ఆకుమళ్ళు,
నీళ్ళు లేక గాసిలు ప్రజలు
నోరు లేని గొడ్డు గేదెలు,
నిప్పులు చెరిగే నీ వడగాడ్పులకు
మోరేళ్ళా నిండిన నిర్భాగ్యులు—
చూడు చూడు భువిని
చూడ వయ్యా దయను.

నీదారుణ కోపాగ్ని
భూదేవికి శాపాగ్ని
అయినా
రూపెత్తిన సహనం కనుక
వాపోవదు వసుంధర,
కాని
ఆ తల్లి దీనాకృతిని
అవలోకించ లేము మేము
ఎండదొరా! ఎండదొరా!
గుండె దడ కలిగించకు మాకు!

—చల్లా రాధాకృష్ణశర్మ

మీకు నామీద అనుమానం కలిగింది. ఇక్కడ నాకిక పనిలేదు... మీకన్నీ అప్పగించి వెళ్ళిపోతున్నాను. పెద్దవాడివయ్యావు. ఇక అన్నీ నువ్వే చూసుకో...' అని అర్థం పర్థంలేని కాగితాల కట్టలు కొన్ని ముఖాన పడేసి వెళ్ళిపోయాడు.

తనకీ కర్మకాండలో ఏమీభాగం లేనట్లు మా ఎదురుగుండా అన్నగారినే దుయ్యబట్టింది అన్నపూర్ణ. తనకా యింట్లో స్థానంలేకుండా పోతుందేమోనని ఆమె భయపడినట్టుంది. వ్యసనాలకు బానిసలయ్యారుకాని నాన్నగారిలో అనురాగం, సహృదయత నాశనం కాలేదు. ఆస్తినీ, అర్ధాంగినీ, ఆరోగ్యాన్నీ, ఆత్మీయులనీ కోల్పోయాక అంతరాలలో అణగిపోయిన అనురాగం బయటకు వచ్చింది! అందుకనే అన్నపూర్ణ చేసిన అపరాధాలన్నీ తెలిసి వచ్చినా ఆ వయస్సులో ఆసరా అయినందుకు ఆమెను క్షమించారు ఆయన.

తమ తప్పులేవో తాము తెలుసుకున్నారు కనుక లోకనాథం చురుక్కు మనిపించిన నిందల్ని అన్నయ్య, నాన్నగారు భరించవలసి వచ్చింది. అతడు చూపించిన కాగితాలకు తలాతోక అర్థంకాలేదు. అన్నయ్యమ రెండు రోజులు కూర్చుని నాడేం తంటాలు పడ్డాడో అఖరికి ఆస్తికి, అప్పులకి లెక్క దొరికింది.

మేముంటున్న మేడ, అద్దెకిచ్చిన మేడ, బీచిదగ్గరి బంగళా, ఫాన్సీషాపు, నిత్యం వాడుకొంటున్న కారు, అన్నయ్య స్కూటరు, అమ్ముకోగా మిగిలిన పదెకరాల భూమి. ఇవి ఉన్నాయని అందరికీ తెలుసు. కాని, అప్పులే తెలియలేదింతవరకు. అన్నయ్య కనుక్కున్న వాటినిబట్టి మూడిళ్ళమీద కట్టవల్సిన పన్నులు వగైరాలు. ఫ్యాన్సీ షాపుకి సెట్లకిబడికని తెచ్చినది. ఇతర చిల్లర అప్పులు కలిసి మొత్తం పాతికవేలు అప్పు ఉందని లెక్క తేలింది.

నాన్నగారి సలహాప్రకారం రైతుల దగ్గరకివెళ్ళి భూములపై వచ్చే ఆదాయం గురించి ఆరాతీస్తే ఏటా ఎనిమిదివేల రూపాయిలు లోకనాథానికి వాళ్ళ ముట్టచెప్తున్నారని తెలుసుకున్నాడు; అప్పుడే తెలిసింది... ఇదివరకు నాన్నగారు అమ్మివేసిన పాతికెకరాల భూమి ఇప్పుడు లోకనాథం సొంతమయిందని. ఇంతకన్నా అతడు చేసిన మోసానికి వేరే నిదర్శనం ఏం కావాలి? ఈ మధ్యకాలంలో మా పదెకరాలు అలాగే ఉన్నాయికాని అతని పాతికెకరాలు ముప్పయ్యెకరాలపైన పెరిగింది. ...ఇక, ఇది చేసాడు, అది చేయలేదు అని చెప్పటం ఎందుకు? మా ఆస్తిలో సగం తెలివితేటలతో సంపాదించుకున్నాడు. మిగతాది మాకు అటు యిటు కాకుండ చేసాడు. అటు మా సంసారాన్ని విచ్ఛిన్నం చేసాడు... శంభుతాత లాంటి విశ్వాసపాత్రులైన నౌకర్లకు ఈ విషయాలు తెలిసినా ప్రయోజనం లేకపోయింది. వాళ్ళ వయ వాక్యాలలోని నిజానిజాలు అర్థం చేసుకునే స్థితిలో లేకపోయారు నాన్నగారు. ఏడుతరాలు కూడబెట్టబడిన ఆస్తి ఒక్కని తెలివి తక్కువ తనంతో హరించి పోయింది. కొందరి జీవితాలకి అదొక శాపం!

(ఇంకా వుంది)

# మోక్షమెన్ని విధాలు?



బులుసు వేంకటరమణయ్య * ధర్మపథం

మోక్షమంటే విడుదల. అదే ముక్తి. సంసార బంధాలనుండి విడుదల కలిగించి, సంసార దుఃఖాలనన్నిటినీ పోగొట్టేదీ, గొప్పదైన బ్రహ్మానందాన్ని కలిగించేదీ ముక్తి. ఆ ముక్తి నాలుగు విధాలుగా ప్రసిద్ధమై ఉన్నది. ఈ విషయాన్నే క్రింది శ్లోకాలు తెలుపుతున్నవి—

'ముక్తిశ్చతుర్విధా ప్రోక్తా
శ్రూయతాం కథయామివః,
సంసార క్లేశ సంహర్త్రీ
పరమానంద దాయినీ.
సారూప్యా చైవ సాలోక్యా
సాన్నిధ్యా చ తథాపరా,
సాయుజ్యా చ చతుర్థీ స్యా..
......................'

సంసార క్లేశాలను నశింపజేసేదీ, పరమానందాన్ని ఇచ్చేదీ అయిన ముక్తిని గురించి మీకు చెప్తున్నాను వినండి. ఆ ముక్తి సారూప్య ముక్తి, సాలోక్య ముక్తి, సాన్నిధ్య ముక్తి, సాయుజ్య ముక్తి అని నాలుగు విధాలు — అని పయి శ్లోకభాగాల అభిప్రాయం.

సారూప్యమంటే భగవంతునితో సమానమైన రూపాన్ని పొందడం — అంటే భగవంతునితో సమానంగా ఉండడం. సాలోక్యమనేది భగవంతుడు ఉండే లోకంలో— అంటే వైకుంఠంలోనో (విశిష్టాద్వైతుల మతాన్నిబట్టి), కైలాసంలోనో (శైవుల సిద్ధాంతాన్ని అనుసరించి) ఉండడమన్న మాట.

సాన్నిధ్య ముక్తి అంటే — భగవంతుని సన్నిధిలోనే ఉంటూ ఉండడం. సాయుజ్య ముక్తి అంటే భగవంతునితో ఐక్యాన్ని చెందిపోవడం! అంటే ఆయనలో కలిసి పోవడం!

ఈ నాలుగింటిలో ఒకదానికంటె మరొకటి ఉత్కృష్టమైనది. సారూప్య ముక్తి ఎక్కడ ఉన్నా పొందదగేది. భగవంతుడున్న లోకంలోనే ఉండవలెననే నియమం లేదు. సాలోక్య ముక్తి—భగవంతుడున్న లోకంలో ఎక్కడ అయినా ఉండి పొందదగినది, ఆయన దగ్గరలో ఉండాలనే నియమం లేదు. భగవంతుని సన్నిధిలో ఉండడమే సాన్నిధ్య ముక్తి. భగవంతునిలో కలిసిపోవడమే సాయుజ్య ముక్తి. సాన్నిధ్య ముక్తిలో జీవాత్మ పరమాత్మలకు భేదభావం ఉంటుంది. సాయుజ్య ముక్తిలో ఆ భేదభావం ఉండదు. అందువల్ల ఇదే మిక్కిలి ఉత్తమమైనదని తెలుసుకోవాలి ●



'రమాపతి ఖమ్మం పోయాడుగా!?...' నరహరి హేళా నవ్వి, సగం గొంతుకతో అన్నాడు, అదో రహస్యమయినట్టుగా.

'త్రిసంగమం'లా ఏర్పరచిన కాలువ వంతెన అంచున వెనక్కి చారగిలబడి, సిగ రెట్ కొడిని నీటిలోకి దులిపేవాడల్లా ఆగి, ముకుందం, 'సందేహం ఎందుకొచ్చిందీ... షరా మామూలే...' అన్నాక, ముసిముసిగా నవ్వాడు.

కాలువలోకి గులకరాళ్ళు జారవిడుస్తున్న మూర్తి పెదాలను 'నీటిని తాకిన గాలి కెరటం'లా. నవ్వని నవ్వుతెర తాకింది. చేతిలోని గులకరాయిని ఎగరేసి, తల మీదుగా వెనక్కి కొట్టి. 'మీకా సంగతి తెలీదు కదూ?' అన్నాడు నన్ను చూస్తూ.

వారం క్రితమే 'గేడ్' యిస్తూ నన్నీ 'అయిన్ కూల్'కి బదిలీ చేశారు. ఊరు పెద్దదే. అయినా ప్రయాణ సౌకర్యాలు తగు మాత్రంగా లేవు. చెప్పుకోగల అభివృద్ధి ఏదీలేదు. అందుకు కారణాలు అప్రస్తుతమయిన రాజకీయాలు. రమాపతి యీ 'అయిన్ కూల్'లోనే లెక్కల మాష్టారు.

'ఏ సంగతి?'—అన్నాను.

ఫర్లాంగు దూరంలో లేలాండ్ లారీ హొకటి పశువులు తొలగడానికి 'హారన్' చేస్తూంది. దూరాన పల్లె పడుచుల వుయ్యాలపాట గాలి తెరలతో కలిసి మా చెవుల్ని తాకుతోంది — సన్నగా. కాలువ గట్టుప్రక్కగా వున్న కాలిబాటలో, గాడిద

మీసు మీద బట్టల మోటలు వేసి; వయిగా చంటిపిల్లాడిని కూరుచో పెట్టిన చాకలి దంపతులు బుజాలు రాసుకుంటూ పోతున్నారు.

'మీరు గమనించారో, లేదో ... నిజానికి రమాపతి మంచివాడే అయినా, 'బ్రహ్మ కయినా పుట్టు రిమ్మ తెగులు' అన్నారు కదటండీ?' నరహరి తమాషాగా నవ్వి, చేతులు వూపుతూ అన్నాడు.

'ఏం చేశాడేమిటి?'

'—ప్రభుత్వాన్ని వుద్ధరించాడు.' టక్కున అనేసి, పక్కున నవ్వాడు. ముకుందం.

'ప్రభుత్వాన్ని కాదు మాష్టారో ...' తనకేదో అన్యాయం జరిగినట్టు పెద్దగా అరచి, తేలికగా నవ్వుతూ 'ప్రభావతిని' అన్నాడు. మిగిలిన యిద్దరూ హెచ్చుతగ్గులు లేని చిలిపి నవ్వు నవ్వారు.

అసలు విషయాన్ని దాచుతూ, వారలా నవ్వుతూ, వ్యాఖ్యానాలు చెయ్యడం నాకు నచ్చలేదు. లోలో చిరాక్కూడా కలిగింది. అయినా నా అభిప్రాయాలను 'నిష్కర్ష'గా చాటే చనువు యింకా ఏర్పడలేదు. లాంఛన ప్రాయంగా నవ్వి 'ఏవిటి కథ?' అన్నాను 'టయిం' చూస్తూ.

'ఇప్పటి మాటా?... ఐదు సంవత్సరాల నుంచీ...'

నరహరి తీస్తున్న చీ—దీర్ఘాన్ని మధ్యలో కొరికేస్తూ— 'ఐతే మాష్టారూ, యింకా సంబంధం వుంటుందంటారా? ... నాకను మానం' మూర్తి.

'నీకన్నీ అనుమానాలే. పులుపు తగ్గాక గాని, పులుపులోని 'టేస్ట్' తెలిసిరాదట! నాలుగు సంవత్సరాలు గడవనీ, నలుగురు పిల్లలయాక, ఈ చచ్చు అనుమానాలన్నీ పుచ్చు పడతాయి. ముకుందం సిగరెట్ పీక విసిరేసి, మరో సిగరెట్‌తీసి పెట్టె మీద కొడుతూ, అన్నాక, టి.బి. పేషంట్‌లా ఓ నిముషం దగ్గాడు.

లేలాండు లారీ కనుమరుగవుతూంది. చాకలి దంపతులు బుజాలు రాసుకుంటు న్నదీ, లేనిదీ కనుపించడంలేదు. పడమర కొండలపయిగా విచ్చిపోతున్న వెలుగు కిర ణాలు ... కాలువలో జలకాలాడుతున్నాయి. చుట్టూరా పొలెగూడులా అల్లుకపోతున్న చీకటి.

ముకుందాన్ని సిగరెట్ అడుక్కొని, పెదాల చివర సుతారంగా ఆనించి, అగ్గి పెట్టెకోసం చేయిచాపి 'ఆ ఫామిలీ — ప్లానింగ్ వుంది — చూశారూ?' అని, ముకుందం యిచ్చిన అగ్గిపెట్టెతో సిగ రెట్ ముట్టించి, పొగను వుంగరాలుగా వది లాడు. ఉంగరాలు నిలువడంలేదు కొన్ని క్షణాలాగి మరోసారి సిగరెట్ పీల్చి, కొడి రాల్చుతూ.' అసలు మీ అభిప్రాయం చెప్పండి' అన్నాడు.

'మంచిదే' అన్నాను.

ముకుందం చీమకుట్టినవానిలా చటుక్కున లేచాడు. 'భలేవారే మాష్టారూ, మంచిదని 'స్టయిల్'గా కొట్టిపారేస్తే లాభం? ... ముద్దాయిని— అవుననీ, కాదనీ, టక్కున చెప్పేస్తే 'కోర్టు' అంగీకరిస్తుందేవిటి... సాక్ష్యాలు చూపించాలి. వాదించాలి. ఆ వాదంలో వాస్తవం తారలా మెరవాలి 'సోనీ, ఎలా మంచిదంటున్నారు?' స్వరంలో శీవి వుంది.

నాకు ఏం చెప్పాలో వెంటనే స్ఫురించ లేదు.

మేకలు కొన్ని కాలువలో నీళ్లు త్రాగు తున్నాయి. వంకీ కర్ర బుజంమీదుగా, చేతులు చాపి 'కీ...య్యోయ్...' అంటు న్నాడు కాపరి. నీళ్లు త్రాగిన మేకలు కొన్ని చేనులోకి పరుగెత్తాయి. కాపరి తన వాడుక భాషలో ఏదో అంటూ వాటిని వెన్నంటాడు. గుంపంతటినీ ఓచోట చేర్చ డానికి కాపరి పడుతున్న అవస్థకు నవ్వొ చ్చింది,

ఓ నిముషం వయిగా ఆగి, 'ఆహారం మనకవసరం—అది లేకపోతే బ్రతకలేం. అలాగని మితిమీరి తింటే ఏమవుతుంది?' కొన్ని క్షణాలాగి, 'దాంపత్యానికీ, సంతా నానికీ వున్న సంబంధమూ అలాటిదే ... వ్యక్తిగతంగా దాని ఆవశ్యకతను గుర్తించ నంతకాలం, 'లైఫ్‌లోని థ్రిల్' కనుమరు గవుతూంది ... నా వ్యక్తిగతాభిప్రాయం సుమీ...' అన్నాను.

'అవునులెండి. మీరన్నట్టు 'థ్రిల్' అనుభవంలోకి రావాలంటే, నిజమే... అవ సరమే మరి...' మూర్తి అదోలాటి స్వరంతో అన్నాడు.

'అయితే మాష్టారూ, రమాపతి 'థ్రిల్'కోసమే ఆపరేషన్ చేయించుకున్నా డంటారు...యేం?' నరహరి మూర్తిని చూస్తూ అన్నాడు.

వులిక్కిపడ్డాను అంతరాంతరాల్లోనే. కొన్ని క్షణాలదాకా ప్రాన్పడి పోయాను. అనేక కారణాలవల్ల బయటపడ నొల్లని నా అంతరంగాన్ని ఆప్పేపెట్టి, వైరివానిలా చూడసాగాను; 'స్వీట్ — నయిన్‌టీన్' యాక్షన్ చేసిన హీరోయిన్ నభినందించేం దుకు గ్రీన్ రూంలో దూరిన 'టీన్ — యేజ్' అభిమాని. మేకప్ తీసేస్తున్న అమ్మమ్మను చూసి, పొందిన 'ధిగ్భ్రమ' లా—వాళ్ళ చర్చనీయాంశానికి వెనుక నున్న విషయానికి చకితుడనయి పోయాను.

ముకుందం కులాసాగా నవ్వి, తమాషాగా సిగరెట్ వెలిగించాడు.

మొహం చిట్లించి నరహరిని చూస్తే ముకుందంతో 'యిక వెళదాం' అన్నాను.

నేనో, నామాటో, అర్థంకానట్టుగా చూసి, ముకుందం, 'వెళ్ళి వెలగబెట్టే రాచకార్యమేముందండీ, కూర్చోండి.' అన్నాడు.

పొలంలో పాలేరొకడు 'టార్చి' వెలు గులో కాలువనీళ్లు మడికి మలుపుతున్నాడు. దూరాన్నుంచి నక్కల కూతలు, కాలువలో కప్పల కోలాహలం, చుట్టూరా కీచురాళ్ళ శబ్దం, చీకటి గొల్లుమ్మి పాటలా వుంది.

లేచినవాడినల్లా మోకాలు దగ్గర ఫాంటు మడతను సరిజేసుకొని, విధిగా కూర్చున్నాను.

మూర్తి, నా బుజం తాకి, 'మీకు అసలు విషయం తెలీక 'బోర్' ఫీలవు తున్నారు.' తాపీగా అన్నాడు.

'మీరు చెప్పండే...'

ముకుందం సిగరెట్ కొడి రాలేందుకు చిటికేసి, నిప్పు ఎరుపుదనాన్ని బొటన వ్రేలితో తాకుతూ, 'రమాపతి' 'ఆప రేషన్' చేయించుకున్నాడని కాదు మాష్టారూ, మేం హేళన చేస్తుందీ...'

'పాం...పాప్...'

ఉలిక్కిపడి తలెత్తాము. పొలం గట్టు మీద పాలేరు కర్రతో కొడుతూ, అయి స్తున్నాడు. ఉషారుగా అందరమూ పరు గెత్తాము. అప్పటికే అది చచ్చిపడి వుంది. నరహరి పాలేరు చేతిలోని 'టార్చి' అందు కొని, పాము మీదకు 'ఫోకస్' చేశాడు. తల చితికి, నాలుక బయటికొచ్చి, రక్తంతో వికృతంగా వుంది, పాలేరు చేతి కర్రతో

# సహజం

పామును కొరిచి, మూతల్లోకి వూతిస్తున్నాడు మూర్తి.

'మూడుమూర్ల బెత్తెడుంది ... తప్పదియ్యి. కొడతాను' పాలేరు.

'పయిసా నోటిలోవుంచి కాల్చేయ్' నరహరి టార్చిని పాలేరు కందిస్తూ అన్నాడు.

సింగినాదం లెండయ్యగోరూ, పావు బోడితో తోలుతీయించి ఆరేసి అమ్ముకుంటే అయిదారు రూపాయలొత్తాయి.' పాలేరన్నాక, పామును త్రాడులా కర్రకు మెలేసి, కాలువకేసి నడిచాడు.

'మనవూం వెళదాం' అన్నాడు నరహరి దారికి మళ్ళుతూ,

నా మనసులో రమాపతి సుడితిరుగుతున్నాడు. కొంచెం తెలిసిన అతని కథ— వాసన మాపి తొలిగించిన ఎన్నడూ తినని పదార్థంలా వుంది. ప్రభావతి ఎవరో నాకు తెలీదు.

రెండడుగులు పెద్దగావేసి, ముకుందం ప్రక్కగావచ్చి, 'మాష్టారూ. మనకీ, రమాపతికీ మధ్యలో పాలేరు చంపిన పాముచ్చింది' అన్నాను కృత్రిమంగా నవ్వుతూ.

ముకుందం నిశ్శబ్దంగావుండి, సిగరెట్ పీకను నూవ్వుగు వేలిగోటిమీద ఐదారు క్షణాలు బొటన వేలితో నిలిపాక, విసిరి కొడుతూ, పొగ 'స్టైలు'గా వదిలాడు.

'మరెందుకు మాష్టారూ ?' మళ్ళీ నేనే.

ముందూ, వెనుకల నున్నవారు ముసిముసిగా నవ్వారు. ముకుందం 'తరవాత చెపుతా లెండి' అని, ఐదారడుగులు వేశాక, అయినా చెప్పడానికి ఏముందండీ ... అందరుకూ తెలిసిన రహస్యమే' అన్నాడు.

'రహస్యం — రహస్యంలా వుంచేసి, ఉపమానాలూ, వ్యాఖ్యానాలేనయె, మీరు చెప్పడం!'

ముకుందం పోయలోయలుగా నవ్వాడు.

నరహరి, 'యిప్పటి మాట కాదు మాష్టారూ, ఐదారు సంవత్సరాల నుంచీ..' అంతలోనే స్వరం మార్చి, జాలిగా 'ఆపరేషన్ చేయించుకున్నాక, అతనిలా పరువు మర్యాదలు మంటగలుపుకున్నాడు గానీ,...'

'ఏమండోయ్ ... 'యిన్ట్రీ' మాష్టారూ, పాఠాలు కూడా యిలానే చెపుతున్నారా యేం?...ముందూ వెనుకలు, వెనుకా ముందులు చేస్తూ, పరువు మర్యాదలు మంటగలుపుకున్నాకే ఆపరేషన్ చేయించుకున్నాడండీ...' మూర్తి.

'ఎప్పుడో, వొకప్పుడు...చెప్పాలియండి...'

'చదువుకోలేదన్న మాటేగాని, నిజానికా యిల్లాలు లక్ష్మీదేవి కాదుటండీ?... ఆ యిద్దరు పిల్లలే లేకపోతే అమ్మో ... రమాపతి సామాన్యుడా? ... గమ్మత్తు చూశారూ!, అతగాడితో నెలల తరబడి స్నేహం చేసినా కొరుకుడు పడని గుణమండీ ... ఒకటి చెప్తాడు. మరొకటి చేస్తాడు. లౌక్య మెరిగిన వాడులెండి. గ్రహబలం కలిసిరాక, పంతులయ్యాడు గాని, రాజకీయాల్లోకి దిగితే 'మినిష్టర్' కావాలిసిన వాడు కాదుటండీ?...' ఆగి, చేయి వెనక్కిచాపి, 'ఏదోయ్ ముకుందా,' ఆఖరిది వొకటి పడేయ్,' అన్నాడు.

ముకుందం కోసం సిగరెట్టో, సిగరెట్టు కోసం ముకుందమో, ఆ అవినాభావ సంబంధం నాకు తెలీదుగాని, వాటిని విడిచి, మేలుకొని వుండగా అతని తరం గాదు. దగ్గు ఆయనగారి సతీమణి.

రమాపతిని వదిలేసి, నరహరి సిగరెట్ వెంటబడటం చికాకుగా వుంది.

నరహరి మళ్ళీ ఆరంభించాడు. 'మేమూ మొదటిలో అనుమానపోలేదు సుమండీ ... సలక్షణమయిన సంసారాన్ని వొదిలి, అతనికి ఖమ్మంలో నిద్రెలా పడుతుందా? — అనుకునే వాళ్ళం.' నవ్వి 'రహస్యం దాగుతుందటండీ, తనంతట తానే బయటపడ్డాడు. ఆయనగారి పోకడలూ, ఆవిడగారి రాకడలూ...'

'ఎవరు ప్రభావతేనా?'

ముకుందం కిసుక్కున నవ్వి, నా భుజం మీద చిన్నగా చరిచి, 'మరెవరి సంగతి మనం మాటాడుతుంటా... ఆవిడేం అప్సరస కాదులెండి. తారుపూసిన 'లేలాండ్ లారీ'లా వుంటుంది.' అని, వోసారి ఓటికేసి, చప్పరిస్తూ, 'అయితేనేమండీ, ఆ నలుపులో మెరుపు కలిసినట్లుంటుంది. యిక కళ్ళన్నారూ? ... మ్యూజియంలో పెట్టాల్సినవే కాదుటండీ ?...'

మూర్తి, నరహరులు, కులాసాపడుతున్న పసి పిల్లల్లా నవ్వుకోసాగారు.

ప్రభావతి మాటకేంగాని, ఆక్షణాన వాళ్ళలోని ముకుళించుకున్న ఆశలు రెక్కలిచ్చుకున్నట్లు అయింది.

హరిరామ్







"ఆయితే?..."

నా అనుమానం పెదాలను దాటుతూనే మూర్తి అందుకున్నాడు. 'ఆపరేషన్ చేయించుకోవాల్సిన అవసరం యితనికేమిటా అని కదూ. మీ ప్రశ్న?... మరి దొరదే కదండీ... చేతులు తమాషాగా ఆడిస్తూ, స్వరం తగ్గించి, 'రేపు ప్రభావతికి పిల్లలు పుడితే ఎంత డేంజర్!'

ముళ్ళపొదలో చిక్కుకొన్న కౌపీనాన్ని అతి ప్రయాసతో తప్పించుకున్న దుస్థిలా దీర్ఘంగా నిట్టూర్చాను. మనసులో గజిబిజిగా రకరకాల ఊహలు ... సంచలనం ... ఏ

# సమాజం

పొక్కి ఊహ తక్కిన వాటిని చంపి తాను మాత్రమే నిలిచింది కాదు. రమాపతి పయి ఏ ఉద్దేశ్యం కలిగిందో చెప్పలేను. ఏ ఉద్దేశమూ కలగలేదని చెప్పడం కూడా సబబుగా వుండదు. అయితే అతణ్ణి తాకిగాని నిర్ణయం చేసుకోగూడదనే నిర్ణయానికి వచ్చాను.

మిగిలిన బాటలో కొంత నిశ్శబ్దమూ, కొంత చిల్లర చర్చా, తప్ప గుర్తించుకోవలసిన విషయాలేవీ రాలేదు. రమాపతి పూర్తిగా అడుగునబడిపోయాడు — ఊరు దగ్గరవడంతో!

* * *

మరునాడు 'స్టాఫ్—రూం'లో రమాపతి కనుపించగానే తేరిపార జూశాను.

మనిషి బక్కపలచగా వున్నా బలంగా అనిపించాడు. కొంచెం బట్టతల, లోతుకు పోయిన కళ్లు, తెల్లని చొక్కా, ఖద్దరు ధోవతి — గౌరవాన్ని యినుమడింప జేసే రూపం! చూపుల్లో గంభీరత్వం తొణికిసలాడుతోంది. వినిపించిన రమాపతినీ, కనుపించే రమాపతినీ దగ్గరగా చేసి చూశాను. ఒకటిగా భావించడానికి ధైర్యం చాల్లేదు. నిగూఢత్వం లౌక్యత' నిండిన మనిషిగా చూశాను. నాలోని 'పిటీ' వొప్పుకోలేదు. నరహరి అండ్ కో వర్ణించిన నైతికంగా దిగజారిన లక్షణాలు మచ్చుకయినా కనిపించలేదు. ప్రభావతి నిప్పులేని పొగయినా కావాలి... లేదో, రమాపతి నివురు గప్పిన నిప్పయినా కావాలి.

ఎవరూ లేనిది చూసి, 'నమస్కారం మాష్టారూ' అన్నాను.

టీచింగ్ నోట్సు వ్రాసుకుంటున్నవారల్లా తలెత్తి, 'వన్నేనా' అన్నట్టు చూశారు.

పెదాలమీద చిరునవ్వును 'లిప్‌స్టిక్'లా పులుముకుంటూ, 'నేవచ్చి వారందాటినా మీ పరిచయం పూర్తిగా కలగలేదు' అన్నాను.

కనురెప్పలను రెండు మూడుసార్లు విగరేసి, భృకుటి ముడుస్తూ, సాలోచనగా చూశారు. కొంతసేపయాక, నోట్సు మూసేసి, కుర్చీలో వెనక్కి చారగిలబడి, రహస్యం తెలిసినవానిలా పగలబడి నవ్వారు.

తికమకపోయాన్నేను.

రమాపతి అదోలాటి కంఠంతో, 'ఇందిరా గాంధిగారు, నేను యిండియాకు 'పి. యం.' నని పరిచయం చేసుకోవాలటండీ?' ఆగి' ముందరకు వంగి, చిన్నస్వరంతో, 'ఈ ఊరిలో వేరెవరయినా పరిచయమయితే, అది నన్ను పరిచయం చెయ్యడంతోనే ఆరంభమవుతుంది' అన్నారు. ముఖంలో కొసరంత బాధ, పిసరంత నమ్రత వున్నట్టనిపించింది.

అంతరాంతరాలలో నేర్పుళ్ళిపడ్డాను. నోరు పెగల్లేదు. రకరకాల సందేహాలు... సమాధానాలు లేనివి...నచ్చనివి...రమాపతిపయి నా కుతూహలాన్ని పెంచసాగాయి. ఉవ్వెత్తున వురుకూ, పరుగులుతీసే సాయంకాలపు సముద్రంలా వుంది మనసు—రకరకాల ఆలోచనలు...వొడ్డును తాకి. పెళ్ళున విరుచుకపడే అలల్లా. ప్రతి ఆలోచనలోంచి క్రొత్త ఆలోచన— ఒకవేపు రమాపతిపయినా నా సాభిప్రాయం యినుమడిస్తున్నా, మనసు మారుమూలల్లో 'నేను దగాపడటంలేదు కదా?' అన్పించింది.

ప్యూన్‌తెచ్చి యిచ్చిన 'ఇన్‌షూరెన్స్—ప్రీమియం' నోటీసు అందుకొని, లేచి వెళ్ళిన్నారు రమాపతి.

'క్లాసుందా మాష్టారూ?'

రమాపతి తలెత్తకుండా వూపి, వెళ్ళిపోయారు.

రోహిణీ కార్తె. సుడిగాలిలో చిక్కుకున్న దారం తెగిన గాలిపడగలా, నా మనసు వూహాగానాల'యానం'లో తల్లడిల్లసాగింది. నరహరి అండ్ పార్టీ సమర్పించిన రమాపతి+ప్రభావతి=వేసక్టమీ కథలో మైనసయిన మిసెస్ రమాపతి ప్రశ్నార్థకమయిపోతుంది. రమాపతిలోని వెలుగుసోకని రహస్యమందిరపు ద్వారాలను శోధించాలనే కుతూహలం యినుమడించింది.

సాయంత్రంవరకు యినుమడించిన విరుద్ధభావ సంఘర్షణకు మనసు వేడెక్కిపోయింది. స్కూల్ కదులుతూనే రమాపతి దగ్గరగావచ్చి, 'యింటిదగ్గరేవుంటారా మాష్టారూ?' అన్నాను చనువు సర్వంతో.

నడుస్తున్నవారల్లా ఆగి, నిశితంగా చూశారు. ఆ ముఖంలో విసుగు స్పష్టంగా కనిపించింది. లోలో కొంచెం భయం కలిగింది. తప్పు గ్రహించినవానిలా తలొంచుక నిలుచున్నాను.

రమాపతి నా బుజంతొకి ముందుకు నడిచారు. స్కూల్ ప్రహారీదాటాక, ఆగి, 'నిజం చెపుతారా?' అని కనురెప్పలను ఎగరేస్తూ 'నా గురించి మీకేమి తెలీదా?' అన్నారు.

నిరుత్తరతో నిలుచుండి పోయాను. కొంచెంసేపయాక, నెమ్మదిగా 'నేను నమ్మలేదు మాష్టారూ...' అన్నాను.

రమాపతి నిండుగా నవ్వి 'నమ్మినా, నమ్మకున్నా, నాకు కలిగే నష్టం సున్నాయే లెండి' అన్నారు. నడుస్తూ.

నన్ను క్షమించేసినట్లనిపించింది. వారితో పాటు నడుస్తూ, 'మీకేమీ పనిలేకుంటే షికారెళ్దామా?' జేబులోంచి ఖర్చీఫ్ తీసి ముఖం అద్దుకుంటూ అన్నాను.

'ఈ పేపర్సు యింటిదగ్గర పడేసిగాని చెప్పను' అని, రమాపతి నడక వేగం హెచ్చించారు.

దారి మధ్యలో రమాపతి యిద్దరా పిల్లలూ ఎదురయ్యారు. పరిచయం చేశారు రమాపతి. పిల్లలుచేసిన నమస్కారం అందుకున్నాను. యిద్దరూ శుభ్రంగా, పుష్టిగా వున్నారు. ముఖాల్లో కళవుంది. మాటల్లో 'చిరుగుణం' వుంది.

నా మనసులోని ఒకేవొక ప్రశ్నకు కాలం గడిచే కొలది సమాధానాలు హెచ్చుతున్నాయి. రమాపతిమీద సానుభూతితో కాదు. ప్రభావతిమీద నాకో ఉద్దేశమేలేదు. మిసెస్ రమాపతిపయి సాభిప్రాయం అంత కంటేకాదు...నరహారీ అండ్ పార్టీని చిత్తు చేయాలనికాదు...మరెందుకో...వూహాతీతంగా వుంది...

* * *

ఇద్దరమూ కొండలకేసి నడిచాము. మోతాదుమించిన చల్లదనంతో, వేగంతో, చికాగ్గావుంది—సాయంత్రపు గాలి. నల్లని మబ్బులు గొర్రెల మబ్బుల్ని తరుముతున్నాయి. మనసులోని ఆలోచనల్లా నొసలు మీద వెంట్రుకలు కదిలాడుతున్నాయి.

ఓసారి ఆకాశాన్ని తేరి చూసి, 'వర్షం వచ్చేలావుంది మాష్టారూ?...' అన్నాను.

గాలి కెగురుతున్న ధోవతిని చేతిలో పట్టుకున్నారు రమాపతి. చొక్కా రెపరెపా కొట్టుకుంటూంది. చెంపల్లోకి వచ్చిన నవ్వును దాచుకుంటూ 'పర్వాలేదు పదండి. వర్షానికీ, వాగుడుకీ భయపడేవాడు లేకంటో వుండలేడండీ...' అన్నారు.

నాలో కొంత సిగ్గూ, సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. ఆత్మీయంగా ఓసారి చూసి, దాపులోని నల్లరాళ్ళకేసి తిరిగాను.

రమాపతి గాలి వాలుగా కూర్చున్నారు. దిగువగా నేను.

యుద్ధానికి సిద్ధమయిన సయినికునిలా—నా మనసులో వూహాతీతమయిన పరిస్థితి మా యిద్దరి వయసుల మధ్యనున్న వ్యత్యాసం నాకు మాటల్ని ప్రసాదించడం లేదు. ఏమరుపాటుగా గస్తీ తిరిగే సయినికునిలా, రమాపతి ఏం చెపుతారోనని, తదేకంగా చూడసాగాను.

రమాపతి కాళ్ళు బారుగా చాచి, చేతుల్ని వెనక్కి రాళ్ళమీద ఆనించి, దారినే పోతున్న గొర్రెల్ని తదేకంగాచూస్తూ, 'చేస్తున్న పనిలో తప్పులేనంతకాలం ఎవరికీ భయపడ నవసరం లేదనుకొంటాను. విమర్శించే వాళ్ళు, వెక్కిరించేవాళ్ళు. ఆపని చేస్తున్నారంటే, మనలో తప్పుగ్రహించి కాదు. వాళ్ళ 'మేనర్' అది. ఏమంటారు?' నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అన్నారు.

ఏదో వొకటి అనాల్సిన అవసరాన్ని గుర్తించి. 'మీకు తెలియనిదేముంది మాష్టారూ?... సమాజమన్నాక, ఎదుటి వాళ్ళను గురించి ఏదో వొకటి అనుకోవడం సహజం...అవన్నీ పట్టించుకుంటే, ముందుకు పోలేం.' అన్నాను.

దూరాన కొండల సంధ్యాకిరణాలు కలనేత పట్టుచీరలోని జరీపోవుల్లా వున్నాయి. డొంక దారిన పోతున్న పశువులు లేపుతున్న దుమ్ము,—వయసు మళ్ళిన పడుచు గడిని చూసి, పడుచుపిల్ల ఎగతాళిగా నవ్వుతూ, నిర్లక్ష్యంగా నడిచిన తీవి నడకలా—పడమటి కొండల్లో కూరుకుపోతున్న రౌద్రం వుడిగిన పగటిరాజును లెక్కచెయ్యకుండా తూరుపు రేఖనుంచి గబ్బిలం మొహంతో వస్తున్న—నిశాకన్యకు ఎదురొగుతుంది, చెట్టుమీద కాకులు సమాజంలోని సగటు జీవుల మానసిక దౌర్బల్యాన్ని సూచిస్తున్నాయి.

రమాపతి చిరునవ్వు నవ్వారు. 'ఏమో, ఈ సమాజం ...' గడ్డిపువ్వును త్రెంచి, రేఖలు విడదీస్తూ. 'ఐదు సంవత్సరాల క్రితం అకస్మాత్తుగా లేచిన పొగలో వుక్కిరిబిక్కిరయ్యాను. మాష్టారూ. ప్రపంచంలో మంచికి స్థానం లేదనుకున్నా. కాని మంచిలో కలిసి నిందలూ, నిష్ఠురాలూ, చెడులో డాంబికోల్లాసాలూ, చిల్లర ఆనందాలూ. తప్పకుండా వుంటాయి. నిజం. ఆసమయంలో మరొకరేం చేసేవారోగాని, నా యిద్దరు పిల్లలను చూసి ముక్కుమూసుకుందా మనుకున్న వాడినల్లా చెవులే మూసికొన్నాను.' అన్నారు.

త్రాగినవాడిని మరింత త్రాగించడంలా, పొంగిన హృదయాన్ని యింకా పొంగించడం చాలా సులువు. నెమ్మదిగా అన్నాను. 'ఈ నిందల్ని విని అయినా మీరు ఖమ్మం



పోకుండా వుండాల్సింది.' మౌనంలో ప్రభావతిని వుంచుకొని.

మరుక్షణమే రమాపతి ప్రపంచాన్ని పూర్తిగా గ్రహించాక. పొత్తుకుదరక. విసుగెత్తి, విరక్తితో బ్రతుకుతున్న యోగిలా నవ్వారు. నాలో అనూహ్యమయిన ప్రశ్నార్థకాలు .... ఆశ్చర్యార్థకాలు !... భావ సంరంభం !... నా మనసు 'ఏ' సర్టిఫికేట్ సినిమా చూడడానికి డబ్బుల్లేక పోలుచుట్టూ తిరుగుతున్న యవ్వనం రుచులు వింటున్న 'ప్లాట్ ఫ్రాం' కుర్రాడిలా ఆవేశపడసాగింది.

'మీకు చెప్పక పోవడమెందుకు లెండి. అక్కడో చిన్నయిల్లు కట్టిస్తున్నాను.' అన్నారు.

పరిపరి విధాల పోతున్న ఆలోచనలతో అసలు విషయాన్ని రాబట్టడానికి, మనసులో మాటల—ఫార్ములా తయారు చేసికుంటున్న వాడినల్లా వులిక్కిపడ్డాను. రెప్పలు తాటిస్తూ. సూటిగా రమాపతిని చూశాను. యిల్లు కట్టించడంలోని నిజానిజాలలా వున్నా ప్రభావతి మీంచి నా దృష్టి మళ్లిస్తున్నా రనిపించింది.

'ఏమిటలా చూస్తున్నారు?' అన్నారు రమాపతి.

'ఈ విషయం చెప్పి వాళ్ల నోళ్లు మూయించక పొయ్యారా?'

'ఎవరి నోళ్ళు...'రమాపతి మానవ ప్రవృత్తిని పూర్తిగా రుచిమాసిన వానిలా నవ్వి. 'సమాజం నోరు మూయించడమంటే, మన ముక్కు మూసికోవడం అన్నమాట.' అన్నారు.

# సమాజం

ఊరిలోంచి ఏవో అస్పష్టమయిన అరుపులు. కుక్కలు దీర్ఘం తీసి మొరుగుతున్నాయి.

'గమ్మత్తేమిటంటె, ఎవరూ నా యెదురుగా నిల్చోలేదు. నేను కలిపించుకొని కలిసే స్వభావంలేని వాణ్ణి,' నా కన్నుల్లోకి జాలిగా కొన్ని క్షణాలు చూసి, 'వాళ్ల క్రియలకు వంత పలుకుతా. వ్యక్తిత్వం చచ్చి బ్రతకనందుకు...' స్వరం గద్గదికంగా వుంది.

దూరాన్నుండి పొలియో...పొలియో... అనే కేక, దగ్గరలోని 'చెట్టుమీద కాకుల అరుపులతో కలిసి, ఏటువేపు నుంచి వస్తుందో తెలీడంలేదు. నల్లని మబ్బుల్ని చీల్చుకొని నక్షత్రాలు నవ్వుతున్నాయి.

నా కుతూహలం కనురెప్పల్ని కట్టిపడేసింది. పరిసరాలను పారద్రోలింది. క్షణాలు భారంగా నడుస్తున్నాయి.

రమాపతి చాలా తేలికగా నిట్టూర్చి. 'పదండి...చీకటి పడుతుంది.' అంటూ లేచారు.

అపశకునం విన్నవానిలా వులిక్కిపడ్డాను. గంట పట్టుగా కూర్చోబెట్టి ఆప్యాయంగా అనుభవాలన్నీ చెప్పేసి. అసలు విషయం రహస్యంగా వుంచేసినందుకు అయోమయంగా చూసి నిర్లిప్తంగా వెంబడించాను.

చుట్టూరా కీచురాళ్ల ఘీంకారం భయంకరంగా వినిపిస్తోంది. అవి ఎందుకరుస్తాయో. ఎక్కడుంటాయో, ఎలా వుంటాయో నాకు తెలీదు. వాటి అరుపుల వల్ల కలిగే నష్టం కూడా లేదనుకుంటాను కాని పిరికి వానికి అడుగు ముందుకు పడదు.

రమాపతి సాహిత్యం గురించి ఎన్నో చెప్తున్నారు. అతను చెప్పే విషయం నా చెవుల్లో దూరడంలేదు. మనసు అతన్ని గురించి అంచనా వేస్తుంది. ఊరు దగ్గర పడంతో నా ఆరాటం అధికమయింది.

రమాపతి అసలు విషయం దాచడానికీ నరహరి అండ్ సమాజం హేళన చేయడానికీ. సంబంధం వుండే వుంటుందనిపించింది. అయినా అడగకుండా వుండలేక పోయాను.

అడిగాను.

బిగ్గరగా నవ్వారు రమాపతి. అయిదు నిముషాలు గడిచాయి. 'యీ సమాజంలో చెప్పేదు మాటలకన్న ప్రభావ మెంతటిదో గమనించండి. నన్ను గురించి నేను చెప్పుకున్న దానికంటే. యితరులు చెప్పిన దానికే మీమనసు కట్టుబడింది...నాకు యిద్దరికి మించి పిల్లలు పుట్టకపోతే నేను ఆపరేషన్ చేయించుకున్నాననే వుద్దేశ్యం ఎందుకు?' ఎదురు ప్రశ్నవేశారు రమాపతి.

నా మనసులో...క్షమించాలి...మాటల్లోకి మార్చలేని మానసిక స్థితి నాది. అస్పష్టంగా చెప్పి. ఆత్మద్రోహం చేసుకునే కంటే, అసమర్థతను చాటుకోవడం తప్పు కాదనిపిస్తుంది.

* * *

మరో వారానికి అనాలోచితంగానే రమాపతి గారితో కలిసి, వారు కట్టిస్తున్న యింటిని చూసేందుకు ఖమ్మం వెళ్లాను. నిజంగా ఆశ్చర్య పోయాను. చిన్నయిల్లు అంటే రిటయరయ్యాక వుంటానికేమో అనుకున్నాను. మూడు పోర్షను ముందు భాగాన 'షాప్స్' వెనుక భాగాన 'ఫామిలీస్' వుండేందుకు అనువుగా వుంది. మనసులోనే వారిని అభినందించాను. ఆ మధ్యాహ్నం ప్రభావతి యింట భోంచేశాము.

షరా:—ప్రభావతి ఎవరో అడక్కండి యింత చెప్పి అది చెప్పక పోవడానికి రహస్యమేమీకాదు. యింత చెప్పాను కాబట్టి. సొంతంగా పరిశీలించి సొంత నిర్ణయాలు చేసుకోమంటున్నాను. కాదు కూడదు చెప్పమంటారా?... రమాపతి పెదనాన్న బిడ్డ—ప్రభావతి?



# వెండితెర వెలుగు నటి జయ



మే 17 న శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ వారి కొత్త చిత్రం షూటింగు సత్యా స్టుడియోలో ప్రారంభమైంది. నేను న్యూస్‌కోసం వెళ్ళాను.

ఒక చక్కదనాల చుక్క, పదహారేండ్ల ప్రాయంలో వున్న కన్నెపడుచు నీలిరంగుచీరె, అదే రంగు జాకెట్టు ధరించి సెట్లోకి అడుగు పెట్టింది. ఆమెను అప్పుడే చూశాను గాబట్టి, ఆమె ఎవరో నాకు తెలియదు. ప్రముఖ దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు గారిని ఆమెనుగూర్చి అడిగాను. వారు ఆ చిన్నారిని పిలిచి, నాకు పరిచయం చేశారు. ఆమె పేరు జయ.

ప్ర: మీ మాతృభాష తెలుగా ?

జ: కాదు. మరాఠీ.

**నాగభూషణం యిచ్చిన అవకాశం**

ప్ర: మీకు తెలుగు రంగంలో ప్రవేశం...?

జ: ప్రముఖ నటులు శ్రీ నాగభూషణం గారు నేను తమిళంలో నటించిన 'సుదరం మూరావలియుం' సినిమాను చూశారు. వారి చిత్రం 'ప్రజానాయకుడు'లో నాకు వేషం యిచ్చారు.

ప్ర: మీకు తమిళం వచ్చున్నమాట...?

జ: అవును. నాకు తమిళ చిత్రంలో అవకాశం యిప్పించిన కథకుడు గుహనాథన్ గారిని నేను ఎప్పటికీ మరువలేను. వారి ఆశీర్వాద బలంతో అయిదారు తమిళ చిత్రాల్లో నటించాను.

ప్ర: తెలుగులో ఎన్ని చిత్రాలున్నాయి?

జ: ప్రజానాయకుడు, హేమాంబరధర రావుగారి చిత్రం, శ్రీధర్ ప్రొడక్షన్, శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ చిత్రాల్లో వెరైటీ పాత్రలు దొరికాయి.

ప్ర: తెలుగు ధారాళంగా మాటాడగలరా ?

జ: కొద్దికొద్దిగా వచ్చు. ఒక ట్యూటరును పెట్టి నేర్చుకుందామనుకుంటున్నాను.

**మంచివాళ్లు... తెలుగువాళ్లు**

ప్ర: తెలుగువాళ్లపై మీకు ఏర్పడ్డ అభిప్రాయం ?

జ: సజ్జనులు. గర్వం లేనివాళ్లు. ప్రోత్సహించే మనస్తత్వం గలవాళ్లు.

ప్ర: సెక్స్‌పై మీ అభిప్రాయం ?

జ: అసహ్యంగా కనిపించే శృంగార దృశ్యాలంటే నాకు అలర్జీ. సన్నివేశ ప్రాధాన్యతను బట్టి సెక్స్ అవసరమే. కాని అది అసభ్యంగా కనిపించరాదు.

ప్ర: మీరెంతవరకు చదివారు ?

జ: ఎస్. ఐ. యి. టి.లో పి. యు. సి. చదివాను. ప్రైవేటుగా బి. ఏ. డిగ్రీ పరీక్ష వ్రాయాలనుకుంటున్నాను.

**దోరాహా నచ్చింది**

ప్ర: 'దోరాహా, జరూరత్' చిత్రాలపై మీకు ఎలాంటి అభిప్రాయం కలిగింది ?

జ: 'దోరాహా' నాకు నచ్చింది. దర్శకుని మేధాశక్తి ప్రతి ఫ్రేములో కనిపిస్తుంది. 'జరూరత్' నాకు నచ్చలేదు.

ప్ర: 'దోరాహా' తెలుగులో తీస్తూ, మిమ్మల్ని నాయికగా అడిగితే, అంగీకరిస్తారా ?

జ: ఒప్పుకోను. హిందీలో హిట్ అయింది. గాబట్టి మరొక వెర్షన్ విజయవంతంగా ప్రదర్శింపబడడం కష్టం.

ప్ర: మీకు డాన్స్ వచ్చా ?

జ: ఓరియెంటల్, భరతం, వెస్టరన్‌లో ప్రవేశం వుంది.

**అన్నీ యిష్టమే ...**

ప్ర: మీకెలాటి పాత్రలంటే యిష్టం ?

జ: ఫామిలీ రోల్సు గావుంటే చాలా యిష్టం. నటికి ఫలానా అన్న ప్రసక్తి వుండకూడదు. ఇంతలో షాట్ రెడీ అన్నారు, దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు. జయ షాట్‌లో పాల్గొనడానికై వెళ్ళింది. ఆమె నటించిన ఒక సన్నివేశాన్ని చూశాను. చూసి, ఆమెను అభినందించాను. వెండి తెరకి మరొక దిట్టమైన నాయిక లభించింది, అనిపించింది నాకు.

—ఇంటర్వ్యూ: శ్రీనివాస్



నటి: షీలా

(చిత్రకారుడు శ్రీ ఎం. ఆర్. ఎన్. ప్రసాదరావు)



'మేనకోడలు'లో రేణుక, సూర్యకాంతం,

# సినిమా

## ఊటీలో డ్యూటీ

జగపతి అధినేత రాజేంద్రప్రసాద్‌గారిని మే 25న వారి ఆఫీసులో కలిశాను. అప్పుడు వారు 'బంగారుబాబు' చిత్రం తాలూకు పాటను వింటున్నారు. అంత కమ్మటి పాటను వినే అవకాశం నాకూ కల్గింది. చిత్రంలోని పాటలన్నీ ఒక దానితో ఒకటి పోటీపడేట్లు వున్నాయి.

ఊటీలో వర్షాలున్నాయి? మీ షెడ్యూలు బాగా జరిగిందా? అని ప్రశ్నించాను.

మొదటి అయిదురోజులు వర్షం కురిపించింది. ఆ తర్వాత వెలిసింది. కొన్ని ఫయిట్లు, నాలుగున్నర పాటల చిత్రీకరణ జరిగింది, అన్నారు వి. బి. రాజేంద్రప్రసాద్.



'మంచిరాని తల్లి'లో కృష్ణ, వాణిశ్రీ

'బంగారుబాబు చిత్రంమీద ప్రేక్షకులు చాలా పెద్ద హోప్స్ పెట్టుకుని వున్నారు. వారిని సంతృప్తిపరచాలి, మీరు' అన్నాను. 'నా పనిలో, కృషిలో యేమాత్రం లోపం లేకుండా 'బంగారుబాబు'ను తయారుచేస్తున్నాను. తీసేంతవరకు నావంతు; తీర్పు నిచ్చేది ప్రేక్షకులవంతు' అని చెప్పారు రాజేంద్రప్రసాద్.

'ప్రేక్షకులనాడిని బాగా స్టడీచేశారు గాబట్టే, తీసిన ఎనిమిదిచిత్రాలు ఘనవిజయాన్ని సాధించాయి. ఈ చిత్రంకూడా ప్రజాదరణ పొంది తీరుతుంది' అన్నాను నేను.

## అక్కినేని సోదరిగా జయంతి!

జగపతి ఆర్ట్ పిక్చర్స్ కలర్‌లో నిర్మిస్తున్న 'బంగారుబాబు' చిత్రంలో 'కలెక్టర్ జానకి' జయ, అక్కినేనికి సోదరిగా నటిస్తోంది. వేషం చిన్నదయినా, నటించడానికి ఎక్కువ అవకాశంవున్న పాత్ర జయంతికి దొరికింది. ఈ చిత్రంలో వాణిశ్రీ నాయిక: నాగభూషణం విలన్; రాజబాబు—రమాప్రభ హాస్యాన్ని అందిస్తారు. గెస్టుగా ఎస్వీ రంగారావు. పద్మనాభం రమణారెడ్డి మరియు గుమ్మడి కనిపిస్తారు. కథ, సినిమా అనుకరణ, దర్శకత్వం— వి. బి. రాజేంద్రప్రసాద్. ఛాయను ఎస్. వెంకటరత్నం, సంగీతాన్ని మహదేవన్, రచన్ను ఆచార్య ఆత్రేయ నిర్వహిస్తున్నారు. అన్నపూర్ణా విడుదల.

## ఆఫీసులో వేషాలకోసం వందమంది

సురేష్ అధినేత రామానాయుడుగారిని బోగ్ రోడ్డులోని వారి కార్యాలయంలో కలిశాను. అరోజు అక్కడ దాదాపు వంద మంది ఆయన యింటర్‌వ్యూకోసం వున్నారు. వాళ్ళంతా వేషంకోసం వచ్చిన వాళ్ళేనని తెలుసుకున్నాను, తన చూడ వచ్చిన ప్రతివ్యక్తితో రామానాయుడు మాటాడి, అవకాశాన్నిబట్టి వేషాన్నియిస్తానని పంపించారు.

మీ మొదటి షెడ్యూలు పూర్తయిందా? అన్నది నా ప్రశ్న. 'మే 25న 'జీవనతరం.



గాలు' ప్రారంభమైంది. మొదటి రెండు రోజులు శోభన్ బాబు, చంద్రమోహన్ పాల్గొన్న సన్నివేశాలను చిత్రీకరించాము. తర్వాతి మూడుదినాల్లో లక్ష్మితో పాట చిత్రీకరణ' అన్నారు నాయుడు.

'పై కథకి నవలగా బహుళ ప్రచారం వుంది. అందుచేత చిత్రానికి అదే పేరును వుంచదలిచాము' అని చెప్పారు నాయుడు.

'జీవనతరంగాలు' చిత్రంలోని పాత్రలను శోభన్, గుమ్మడి, చంద్రమోహన్, కృష్ణంరాజు, వాణిశ్రీ, లక్ష్మి, సూర్యకాంతం పోషిస్తున్నారు. మాటలను పినిశెట్టి, పాటలను నారాయణరెడ్డి, సంగీతాన్ని రఘునాథ్, కళను ఎస్. కృష్ణారావు, ఛాయను ఎస్. వెంకటరత్నం చేపట్టారు. ఆగస్టులో షూటింగు పూర్తి చెయ్యదలచినట్లు, వెనువెంటనే నాగేశ్వరరావుగారితో 'దేశంకోసం' వర్ణచిత్రం ప్రారంభించ దలచినట్లు, నాయుడు వెల్లడించారు. నవయుగ విడుదల.

## రెండవ చిత్రం ?

సురేష్‌నుండి ఎస్. ఆర్. కంబైన్స్ ఆఫీసును చేరాను. నిర్మాతలు ఎం. కె. రాధ, ఎన్. వి. సుబ్బరాజు చాలా హుషారుగా కనిపించారు. వాళ్ళు నిర్మించిన 'హంతకులు—దేవాంతకులు' పైన మినిమమ్ గ్యారంటీ వుందని అన్నారు. ఆ చిత్రంలో ప్రముఖ హాస్యనటుడు నాగేష్ పెద్ద యస్సెట్ అని చెప్పారు. అలాగే సత్యం సమకూర్చిన బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ చిత్రానికి బలాన్ని చేకూర్చింది. 'మీ తర్వాతి చిత్రం ఎప్పుడు ?' అని ప్రశ్నించాను. 'చక్కటి కుటుంబ యితివృత్తం కోసం గాలిస్తున్నాము' అన్నారు నిర్మాతలు.

## ఊరికి ఉపకారి

ఎస్. ఆర్. కంబైన్స్‌నుండి నాయర్ రోడ్డులోని సుందరం మూవీస్ కి 440123 కి ఫోన్ చేశాను. నిర్మాత సుందరరామిరెడ్డి అందుకున్నారు. 'ఊరికి వుపకారి' ఎంతవరకు వచ్చిందండీ,' అన్నాను. '7 రీళ్ళు అయింది. అయిదుపాటల చిత్రీకరణ జరిగింది. ఆగస్టు 15 కల్లా షూటింగు పూర్తవుతుంది. చలం యొక్క నవరస నటన్ను యీ చిత్రంలో చూసి విస్తుపోతారు. నాయకుడి పాత్రకి పరిపూర్ణ



మహేష్ మూవీస్ 'జీవనతరంగాలు' ప్రారంభోత్సవసందర్భంలో తీసిన చిత్రం.

న్యాయం చేకూరుస్తున్నారు.' అని చెప్పారు ఎం. ఎస్. రెడ్డి.

పై చిత్రంలో చలంకి జంటగా ఆరతి నటిస్తూంది. క్రైం చిత్రాల ఘటికుడన్న పేరును సంపాదించిన కె. ఎస్. ఆర్. దాసుకు యిది వెరైటీ. విజయా విడుదల.

## చలం చిత్రంలో జయలలిత

శ్రీ రమణచిత్ర ఇంటర్నేషనల్ నిర్మిస్తున్న 'దేవుడమ్మ'లో గ్లామర్ క్వీన్ జయలలిత కథానాయిక పాత్రను పోషిస్తూంది. ఈమెతోబాటు లక్ష్మి, విజయలలిత,

## సినిమా

గీతాంజలి ముఖ్యపాత్రలను ధరిస్తున్నారు. చలం చిత్రాల్లో ఏదేని ప్రత్యేకత వుండాల్సిందే. 'దేవుడమ్మ'లో పిచేత నవ్విస్తూ ఏడిపిస్తాడు; ఏడిపిస్తూ, నవ్విస్తాడు చలం. అసాధారణమైన పాత్రను పోషిస్తున్నాడు సంచలన నాయకుడు. ఈ చిత్రానికి రాజశ్రీ రచయిత. కె. వి. నందనరావు నిర్దేశకుడు. శ్రీఫిలింస్ విడుదల.

మరొక్కమాట. వెండితెర నాయికల్లో పెద్దవాళ్లందరూ చలం చిత్రాల్లో నటిస్తూ వున్నారు. ఒక్క వాణిశ్రీకి మాత్రం సరయిన పాత్ర దొరకలేదు యింతవరకు. 'సంబరాల రాంబాబు'లో ఊర్వశి శారద నటించింది. 'మెట్టిలో మాణిక్యం'లో మహానటి భానుమతి, జమున నటించారు. 'బుల్లెమ్మ—బుల్లోడు'లో విజయనిర్మల, విజయలలిత అగుపించారు. ఇప్పుడు 'దేవుడమ్మ'లో జయలలిత, విజయలలిత, లక్ష్మి కనిపిస్తారు. 'కథాపాత్రలకు సరిపడ్డవారిని పెట్టడం వల్లనే, చలం చిత్రాలు బాగా రక్తికడతాయి' అంటున్నారు ఆంధ్ర ప్రేక్షకులు. ఏదేలాగున్నా వ్యాపార సూక్ష్మం తెలిసినవ్యక్తి చలం. ప్రజలకి ఏంకావాలో తెలుసుకున్న నటుడు చలం. తన చిత్రంమీద గట్టినమ్మకం వుందాయనకు. మంచివాడికి మరోటి జరగదు.

## మరపురాని తల్లి

ఇటీవల రవిరాజ్ ప్రొడక్షన్స్ వారి 'మరపురాని తల్లి' చిత్రాన్ని చూశాను. కేశవజయరాం పేస్తు వున్న వ్యక్తి అని గ్రహించాను. మంచి కథ, చక్కటి ట్రీట్మెంట్. అనూహ్యమైన ట్విస్ట్ వున్న వుదాత్తమైన కథ 'మరపురాని తల్లి' అనడం న్యాయం.

## మరపురాని నటన

టైటిల్ పాత్రను వాణిశ్రీ ధరించింది, ధరించడం అనడం కన్నా ఆ పాత్రకోసం అవతరించింది అంటే మంచిదనుకుంటా. 'మరపురాని కథ, ప్రేమనగర్' చిత్రాల్లో వాణిశ్రీ నటన్ను మరువగలమా? ఆ కోవకు చెందిన నటన్ను 'మరపురాని తల్లి'లో ప్రదర్శించింది. అలనాడు సావిత్రి, నేడు వాణిశ్రీ అన్నమాటకు న్యాయం చేకూరుస్తున్నది. ఈ చిత్రంలో లక్ష్మి కనిపించే కాస్సేపు అద్భుతంగా చేసింది. గొల్లపూడి గారి మాటలు, మహదేవన్ బాణీలు పోటీ పడ్డాయి. ఇక దర్శకుడు డి. ఎస్. ప్రకాశరావు విషయానికి వద్దాం—పుల్లయ్యగారి వరసలు కనిపిస్తాయి. మొదటి చిత్రంతోనే మంచిపేరును, మరిన్ని కంపెనీలు యీ యువకుడికి వస్తాయి. విజయావంశీ సంస్థకు విజయలక్ష్మిని తెచ్చిపెట్టే చిత్రం యిది. ఈ చిత్రంలో నటించిన గుమ్మడి, శాంతకుమారి, సత్యనారాయణ, జ్యోతిలక్ష్మి, అల్లు రామలింగయ్య, రమా

## సినిమా డైరీ

● నందినీ ఫిలింస్ వారి 'ఇల్లు— ఇల్లాలు' షూటింగు చాలకాలం తర్వాత జూన్ రెండవ వారంలో జరుగబోతూంది. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

● త్రివేణి ప్రొడక్షన్స్ 'బడిపంతులు' షూటింగు మే 27 న ప్రారంభమైంది. ఈ షెడ్యూలులో 12 రీళ్లు వచ్చిందని, నిర్మాత పేర్రాజు చెప్పారు. పి. సి. రెడ్డి దర్శకుడు.

మహేష్ మూవీస్ ,,జీవనతరంగాలు మే 25 నుండి, 31 వరకు వాహినిలో జరిగినట్లు, నిర్మాత రామానాయుడు చెప్పారు. తాతినేని రామారావు దర్శకుడు.

● శ్రీ రమణ చిత్ర ఇంటర్నేషనల్ 'దేవుడమ్మ' పాటల రికార్డింగు మే 29 నుండి 31 వరకు జెమినీలో జరిగింది. కె. వి. నందనరావు దర్శకుడు.

● డి. బి. ఎస్. ప్రొడక్షన్స్ 'అబ్బాయిగారు — అమ్మాయిగారు' షూటింగు మే 28 నుండి 31 వరకు జరిగింది. ఒక పాట చిత్రీకరణ జరిగితే షూటింగు పూర్తయినట్టే అన్నారు నిర్మాత డి. బి. నారాయణ. వి. రామచంద్రరావు దర్శకుడు.

● విశ్వభారతీ ప్రొడక్షన్స్ రెండవచిత్రం జులైలో ప్రారంభమవుతుంది. వి. మధుసూదనరావు దర్శకుడు.

● ఆర్. ఎస్. మూవీస్ 'మల్లమ్మకథ' షూటింగు జూన్ 4 న ప్రసాద్‌లో ప్రారంభమవుతుంది. అక్కినేని సంజీవి దర్శకుడు.

ప్రభ, కె. వి. చలం తమ పాత్రల్లో రాణించారు. నాయకుడిగా కృష్ణ తీవిగా, అందంగా, దర్జాగా వున్నాడు. బాలయ్యకు మంచిపాత్ర దొరికింది.

## విలన్‌గా కె. వి. చలం

ఇంతవరకు కామెడీ వేషాల్లో కనిపించి, నొప్పించి, ప్రజలను మెప్పించిన కె. వి. చలం విలన్‌గా నటిస్తాడు అని 'మేనకోడలు' చిత్రం ఋజువు చేస్తుంది. ఈ చిత్రం విడుదలైన తర్వాత, కె. వి. చలం తెరజీవితంలో కొత్తమలుపు వచ్చే

# సినిమా

అవకాశం వుంది. కళాకారుడన్నవానికి ఫలానా అయితేనే సరిపోతాడు అన్న ముద్ర పడకూడదు. ఏపాత్ర నిచ్చినా, తన శక్త్యనుసారంగా నటించడానికి ప్రయత్నించే కళాకారుడు కె. వి. చలం. హోప్‌తో జీవిస్తున్నాడు. తన ధ్యేయంలో జయిస్తాడు.

## నాయికగా జమున

'మేనకోడలు'గా జమున తప్ప మరొకరయితే, చిత్రం రాణించదేమో అనిపిస్తుంది. ఎంత అందంగా వుందో, అంత అద్భుతంగా పాత్రను పోషించింది జమున. మాదిరెడ్డి సులోచన విరచితమైన 'శిక్ష'కి అనేకమైన మార్పులు చేశారు. మాటలను దాసరి నారాయణరావు రాశారు. దర్శకత్వాన్ని బి. ఎస్. నారాయణ నిర్వహించారు. ప్రధాన పాత్రలను కృష్ణ, గుమ్మడి, సూర్యకాంతం, రేణుక, రాజబాబు పోషించారు. వై. సునీల్‌చౌదరి నిర్మించిన యీ చిత్రం అనిల్‌ప్రభాస్ ద్వారా విడుదలవు



'దత్తపుత్రుడు'లో వాణిశ్రీ

## మీకు తెలుసా?

1971 సంవత్సరపు ఫాల్కే అవార్డు స్వర్గీయ పృథ్వీరాజ్ కపూర్‌కి లభించింది.

సెన్సార్ ఆఫీసర్ అసభ్యదృశ్యాలను నిర్దాక్షిణ్యంగా, నిర్మొహమాటంగా కత్తిరించడం ముదావహం. మంచి రోజులు వస్తున్నాయ్ — మన పరిశ్రమకి.

సంచలననాయకుడు చలంచిత్రంలో జయలలిత నాయికగా నటిస్తుందట.

ఎండ ధాటికి ఆగలేక శివాజీ, జయలలిత, ఎం. జి. ఆర్. లు కాశ్మీర్‌కి వెళ్ళారు.

నటి జమున కొడైకెనాల్‌కి (వేసవి విడిది) వెళ్లారు. జూన్ 2న మద్రాసు వస్తారు.

హీరో శోభన్‌బాబు 'మానవుడు—దానవుడు'లో విలన్‌గా కనిపిస్తారట. ఎందుకు?

ప్రముఖనటుడు పృథ్వీరాజ్ క్యాన్సర్ వ్యాధి కారణంగా తమ 66వ యేట మరణించారు.

తుంది.

ఈ చిత్రంలో రావ్‌చౌదరి కెమెరా వర్క్‌కి ఫస్ట్ మార్కు లివ్వాలి. ప్రతి ఫ్రేము చక్కగా వచ్చింది. ఘంటసాల సంగీతాన్ని సమకూర్చారు. షూటింగు పూర్తయింది.

## బడిపంతులు

త్రివేణీ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న చక్కటి, చిక్కటి కుటుంబగాథా చిత్రమే 'బడిపంతులు.' నాయకుడు ఎన్టీ రామారావు అద్వితీయంగా నటిస్తున్నట్లు, ఈ పాత్రను ప్రేక్షకులు మరువలేని విధంగా ఎన్టీఆర్ నిర్వహిస్తున్నట్లు, రషస్ చూసినవాళ్లందరూ ఏకకంఠంతో చెపుతున్నారు. సెట్లో నేను కూడా రెండుసార్లు కంట తడిపెట్టాను—రామారావు భావ ప్రకటనకు లొంగను. 'బడిపంతులు' పాత్ర ఆయనకి విపరీతమైన పేరు, ప్రతిష్టలను తెచ్చిపెడుతుంది. వారి అర్ధాంగిగా అంజలీదేవి నట

సహాజనటునా వైవిధ్యంతో ఆ పాత్రలో జీవించింది. వీరిద్దరిపై సాగే ఈ కథలో నాగభూషణం, రామకృష్ణ, కృష్ణం రాజు, రాజబాబు, అల్లు రామలింగయ్య, రావికొండలరావు, జయంతి, విజయలలిత, సూర్యకాంతం, పద్మిని సపోర్టింగ్ పాత్రలను పోషిస్తున్నారు.

'వెరైటీ కథలను కోరే ఆంధ్ర ప్రజకి యిదొక నావల్టీ. ప్రతిస్త్రీ, పురుషుడు చూడతగిన చిత్రం యిది. ప్రతి తండ్రి, తల్లి, తనయుడు, కోడలు చూచి మెచ్చ గల చిత్రం యిది.' అన్న పరిశ్రమ మాటకు విలువ నివ్వవలసింది మీరే. నిర్మాత పి. రాజు శ్రమ వృధా పోదు. దర్శకుడు చంద్రశేఖరరెడ్డి కృషి ఫలిస్తుంది. పూర్ణా సంస్థకి హిట్ పిక్చర్ అవుతుంది. త్రివేణీ సంస్థకి గౌరవాన్ని, ధనాన్ని ఈ చిత్రం తెచ్చిపెడుతుంది.

## మల్లమ్మకథ ప్రారంభం

ఆర్. ఎస్. మూవీస్ తలపెట్టిన చిత్రం 'మల్లమ్మ కథ' షూటింగు జూన్ 4 న ప్రసాద్‌లో ప్రారంభమవుతుంది. అనేక చిత్రాలకు నిర్మాణ నిర్వాహకుడిగా పనిచేసిన చెంచురామయ్య ప్రారంభిస్తున్న యజ్ఞం యిది. ఈ చిత్రానికి అక్కినేని సంజీవి దర్శకుడు. కాబట్టి డబ్బులకు గ్యారంటీ వుంటుంది. పిక్చరైజేషన్ నీట్‌గా వుంటుంది. కథను వేగంగా నడిపే కిటుకు తెలిసిన దర్శకుడు సంజీవి అని వారి గత చిత్రాలను చూస్తే తెలుస్తుంది.

మల్లమ్మగా శారద, ఆవిడ పెనిమిటిగా కృష్ణ నటిస్తున్నారు. వీరి జతలో తయారయ్యే తొలి చిత్రం యిది. రెండవ జంటగా రామకృష్ణ, విజయలలిత కనిపిస్తారు. ముఖ్యపాత్రలను గుమ్మడి సూర్యకాంతం, ప్రభాకరరెడ్డి, పద్మనాభం, రాజబాబు ధరిస్తున్నారు. సత్యనారాయణది గెస్టు వేషం.

'మల్లమ్మకథ' కోసం కోదండపాణి రెండు పాటలను రికార్డింగ్ చేయించారు. వాటిని మొదటి షెడ్యూలులో చిత్రీకరిస్తారు. ఈ చారిత్రాత్మక కథకి దాసరి నారాయణరావు రచయిత. ఛాయను ఎ. ఆర్. కె. మూర్తి నిర్వహిస్తున్నారు.

ఏస్ కెమెరామెన్ ఆఫ్ ది డేగా, ప్రజల

కరతాళధ్వనుల నెందుకునే ఉత్తమ సాంకేతిక నిపుణుడిగా విరాజిల్లే ఎస్. వెంకటరత్నంగారికి అసోసియేట్‌గా వుండే ఎ. ఆర్. కె. మూర్తి ప్రతిభను గూర్చి వేరే చెప్పాలా...?

## వి. మధుసూదనరావు కుమార్తె వివాహం

మే 28, ఆదివారం ఉదయం ఏనిమిది గంటలకల్లా రాజేశ్వరీ కళ్యాణమండపం వేల మంది ఆహూతులతో కళకళలాడింది. విశేషం — దర్శకుడు వీరమాచనేని మధుసూదనరావుగారి కుమార్తె వివాహం.

సరిగ్గా ఉదయుం గం. 9–21 ని.లకు మధుసూదనరావు ద్వితీయ పుత్రిక సౌ॥ వాణికి గుళ్ళపల్లి దుర్గాప్రసాదరావు గారి కుమారుడు చి॥ భవానితో వైభవంగా పెండ్లి జరిగింది. చిన్నా, పెద్దా తారతమ్యం లేకుండా పెండ్లికివచ్చిన వారందరిన్నీ దర్శకుడు మధుసూదనరావు, సారథీ స్టుడియో రెసిడెంట్ డైరెక్టర్ దుర్గాప్రసాదరావు సాదరంగా ఆహ్వానించి, వచ్చిన వాళ్ళందరికీ విందు భోజనంపెట్టి సత్కరించారు.

పరిశ్రమలో మధుసూదనరావుగారి కెంత పలుకుబడి వుందో అర్థమైంది. పెండ్లి చేస్తే యిలా చెయ్యాలి అన్నారు, వచ్చిన వాళ్ళంతా. అట్టహాసం లేకుండా జరిగిన యీ వివాహానికి వెండితెర బృందం అంతా తరలి వచ్చింది.

## అంజలీదేవి కుమారుని పెండ్లి

పర్స్‌రోడ్డులో అంజలీదేవి, ఆదినారాయణరావుగార్లకున్న భవంతిలో వారి కుమారుడు చి॥ జ్యోతిప్రకాశ్‌కి చీరాల ముంతా సూర్యనారాయణగారి కుమార్తె సౌ॥ భారతీదేవితో జూన్ 1 న ఉదయం నిశ్చయించబడిన శుభముహూర్తంలో వివాహం జరిగింది. పుట్టపర్తి శ్రీ సత్య సాయిబాబా దివ్య ఆశీస్సులతో ఈ పెండ్లి జరిగింది. సినీ పరిశ్రమకు సంబంధించిన వ్యక్తులు, స్నేహితులు, బంధువులు, శ్రేయోభిలాషులు వందలాదిగా వచ్చి వధూవరులను ఆశీర్వదించారు. — ఆనాటి

## సినిమా

సాయంత్రం ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం బృందం యొక్క పాటకచ్చేరీ జరిగింది. మృష్టాన్న భోజనం వడ్డించబడింది. పెండ్లికి విచ్చేసిన వాళ్ళని అంజలీదేవి — ఆదినారాయణరావుగార్లు సగౌరవంగా ఆహ్వానించి, ఫలపుష్ప చందన తాంబూలాలతో సత్కరించారు.

## ముస్తాబవుతున్న దత్తపుత్రుడు

అందరిచేతా మంచి చిత్రం అనిపించుకోవడం చాలా కష్టం. 'దత్తపుత్రుడు' చిత్రాన్ని చూచిన వాళ్ళందరూ చాలా బాగుంది అంటున్నారు. సంగీతం, ఛాయాగ్రహణం, దర్శకత్వం సాంకేతికంగా విజృంభించాయని తెలుస్తొంది. యువకుడైనా ప్రతిభావంతుడే అన్న పేరు లెనిన్‌బాబుకు వస్తుంది, అంటున్నారు. నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తికి యిది అపూర్వ విజయం అవుతుంది. కథను నిర్ణయించేటప్పుడే కడు జాగ్రత్తను వహించడం వల్లనే, రవీంద్రా ఆర్ట్‌పిక్చర్స్ చిత్రాలకి డబ్బుతోబాటు పేరుకూడా ఆనవాయితీగా వస్తూవుంది. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, వాణిశ్రీ, నాగభూషణం ఒకర్ని మించి మరొకరు నటించారని, వున్న పాటలన్నీ ప్రజాదరణ పొందగలవని పరిశ్రమలో మాటాడుకొంటున్నారు. జూన్ రెండవ వారంలో మీ ముందుకు వస్తుంది. లక్ష్మీ కంబైన్స్ విడుదలచేస్తుంది.

## భానుమతి కొత్త చిత్రం

'అంతా మనమంచికే' విశేష ప్రజాదరణ పొందింది. మహిళలను విపరీతంగా ఆకర్షించింది. నిర్మాణంలో వున్నప్పుడు భానుమతిగారు అన్నమాటలు, నిజమైనాయి. ప్రేక్షకులకు భానుమతిగారిపై ప్రత్యేకాభిమానం, ఆమె నటనపై స్పెషల్ రిగార్డ్ వుందని మరొకసారి తేలింది. మన హీరోలు నాగేశ్వరరావు, రామారావులకెంత బలం వుందో, భానుమతికి కూడా అంత వుందని ప్రజలు నిరూపించారు.

భరణీ పిక్చర్స్ 20 వ చిత్రం త్వరలో ప్రారంభం అవుతుంది. ఈ చిత్రానికి



పృథ్వీరాజ్ కపూర్

స్క్రీన్‌ప్లే, సంభాషణలను ఆవిడే సమకూర్చారు. మాటలను భానుమతిగారితో బాటు ఎన్. ఆర్. నంది, సముద్రాల వ్రాస్తున్నారు. జూన్‌లో షూటింగు అని తెలుస్తొంది. ప్రధాన పాత్రలను భానుమతి, రాజనాల, గుమ్మడి, చంద్రమోహన్, రమాప్రభ. పండరీబాయి, అల్లు రామలింగయ్య ధరిస్తారని తెలుస్తొంది. నాయికగా పద్మినికి యిచ్చినట్లే, మరొక కొత్త అమ్మాయికి అవకాశం యివ్వదలిచారు భానుమతి. సంచలన నాయిక భానుమతి నిర్మించే 20 వ చిత్రం మరింత విజయాన్ని పొందడం తథ్యం.

## పృథ్వీరాజ్‌కపూర్ మరణం

ప్రముఖ రంగస్థల, సినీ నటుడు రాజకపూర్ తండ్రి అయిన పృథ్వీరాజకపూర్ మే 29 న బొంబాయిలో మరణించారు. వారి వయస్సు 66 సంవత్సరాలు.

గొంతులో క్యాన్సర్ కారణంగా ఒకనెల క్రితం, పృథ్వీరాజ్ ఆసుపత్రిలో చేరారు. మే 29 ఉదయం గం. 11 లకి ఆయనకి నొప్పి ఎక్కువై, అసువులు వీడారు. చనిపోయినప్పుడు, వారి ప్రక్కన రాజ్, షమ్మీ, శశికపూర్లు, భార్య,

బంధువులు, వెండితెర ప్రముఖులు వున్నారు.

సాయంత్రం ఆరుగంటలకి 'శాంతా క్రస్' మైదానంలో శవదహనం జరిగింది. జ్యేష్ఠ కుమారుడు రాజకపూర్ దహనక్రియ చేశారు.

## జీవిత విశేషాలు

1933 లో నటనా వృత్తిలో ప్రవేశించారు. మొట్టమొదటి టాకీ చిత్రం 'ఆలం ఆరా'లో నటించారు. పృథ్వీ థియేటర్స్‌ని స్థాపించి, అనేక నాటకాలను ప్రదర్శించారు. ఢిల్లీ రాజ్యసభ సభ్యుడిగ 8 ఏండ్లు పదవి వహించారు. సినిమాకి అపారసేవ చేసినందుకుగాను, ఫాల్కే అవార్డు యీ ఏడు పృథ్వీరాజ్‌కి లభించింది. కానీ బిరుదాన్ని, లక్ష్యాన్ని అందుకునే అదృష్టం పృథ్వీరాజ్ నోచుకోలేదు.

—శ్రీనివాస్

---

**అవీ...ఇవీ:**

### వివాహం

శ్రీ మద్దూరి శేషగిరిరావుగారి నాలుగవ కుమారుడు చి. త్యాగరాజు (ఆంధ్రపత్రిక, విజయవాడ)కి శ్రీ రామేశ్వరపు బలరామశాస్త్రిగారి కుమార్తె చి. సౌ. మధుమతికి తెనాలిలోని జూనియర్ కళాశాల ఆవరణలో మే 26 వ తేదీ ఉదయం వైభవంగా వివాహం జరిగింది.

### షష్టిపూర్తి మహోత్సవం

అనకాపల్లిలో వర్తక ప్రముఖులు శ్రీ తూతిక మల్లికార్జునుడు షష్టిపూర్తి మహోత్సవం మే నెల 24 వ తేదీని వైభవంగా జరిగింది. ఆ సందర్భంలో ఆయన స్థానిక రోటరీ క్లబ్బు నిర్మించే కళ్యాణ మండపానికి రూ. 10,000—00 విరాళం ప్రకటించారు. పుర ప్రముఖులు ఆయనను అభినందించారు. పేదలకు అన్నదానం జరిపారు.

ఆ మర్నాడు వారి వ్యాపార సంస్థ వార్షికోత్సవం జరిగింది. వారి వద్ద పనిచేస్తున్న కార్మికుల కుటుంబాలకు నూతన వస్త్రాలు బహూకరించారు. (ఒ. వి.)

* * *

11—5—72 నుంచి అయిదు రోజులుగా రవీంద్రభారతిలో జరిగిన కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంక్షేమ సంఘంవారి నాటక పోటీలలో జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా రిక్రియేషన్ క్లబ్ వారు వేసిన 'పెండింగ్ ఫయిల్' అనే ఏకాంకికకి ఉత్తమ ప్రదర్శనం గోల్డింగ్ షీల్డ్ లభించింది. ఈ నాటకంలో ఆఫీసరుగా వేసిన శ్రీ తిలక్ గారికి ఉత్తమనటుడి కప్పు వచ్చింది. (ఒ. వి.)

# పుస్తకాలు

## ఎ. యమ్. టి. సి.
## అల్లోపతి మెడికల్ మాసపత్రిక

పేజీలు: 116, వెల: రెండు రూపాయలు, ప్రాప్తిస్థానం: 30, నల్లప్ప వాద్దియార్ వీధి, మదరాసు—21.

తెలుగు, తమిళం, ఇంగ్లీషులలో డా. షణ్ముగం గారు నడుపుచున్న ఎ. యమ్. టి. సి. మాసపత్రిక, ఆయుర్వేద, హోమియోపతి, సిద్ధ, యునాని పట్టభద్రులకు, ఆధునిక అల్లోపతి వైద్య విద్యా సౌకర్యములు కలుగ జేయుటకు, స్థాపించి, ప్రారంభించి, నడుపుచుండుట చాల సంతసించవలసిన విషయము. పత్రికలో వారు ఉదహరించిన ఆశయములు ఉన్నతమైనవి. బహువిధములుగ వృద్ధి చెందుతున్న నేటి ఆధునిక వైద్య విజ్ఞానాన్ని వారి మాసపత్రిక ద్వారా, అందులోని సభ్యులకు వ్యాసాలు, రచనలు అందజేయుటవలన కొత్త కొత్త విషయములు, పద్ధతులు తెలుసుకొనుటకు వీలు కలుగును. అఖిల భారత స్థాయిలో ఎ. యమ్. టి. సి. ని గుర్తించుటకు వారు చేయుచున్న కృషి ఫలిస్తే, వారి ఆశయం నెరవేరినట్లే.

ఎ. యమ్. టి. సి. శిక్షా కేంద్ర ఆశయాలు మంచివే. వైద్య వృత్తిలో కుతూహల ముండి, ఆ విద్యను అభ్యసించుటకు అవకాశము లభింపని వారు యీ సంస్థలో చేరి వారి ఆశలు కొంతవరకు నెరవేర్చుకొనవచ్చుటకు సందేహము లేదు. కాని పూర్తిగా వైద్య విద్యలో సారాంశము తెలుసుకొని ప్రజాసేవ చేయుటకు వీలుపడదేమో మరి. ఎందుకంటే వైద్య విద్య, పుస్తకరూపమైన విజ్ఞానమే కాకుండ ఆసుపత్రులలో, రోగ నిదానం, రోగ నిర్ణయాలపై ప్రత్యేక శిక్షణ లేకపోవుటే. అదికాక, ఆయుర్వేదం, హోమియోపతి, యునాని వంటి రకరకాల వైద్య విద్యలు, విభిన్నరీతులు, వేరు వేరు పద్ధతులలో దేని విధానము దానిదిగా ఉంటాయి. అలాంటి విభిన్న విధాలలోని వైద్యులందరిని సభ్యులుగా చేర్చి, అంతకన్న విభిన్నమైన పద్ధతులలో ఉండే అల్లోపతి వైద్య విషయములను, సభ్యులకు పత్రిక ద్వారా అందజేసి, ఒకే త్రాటి మీద నడిపించుట యనిన సంతసించవలసిన విషయమే కాని, దాని సాధ్యాసాధ్యాలు, జయప్రదమయ్యేవరకు ఆ విషయం సందేహాస్పదమేమో ననిపిస్తుంది.

అల్లోపతి వైద్య విద్య పుస్తక విజ్ఞానం వల్ల మాత్రమే కాకుండ, ఆసుపత్రులలో నిపుణుల వద్ద శిక్షణ పొంది, రోగాలను స్వయంగా పరిశీలించి నేర్చుకోవలసిన విషయాలు. అలాగ శిక్షణ లేనివారు రోగ నిదానం, రోగ నిర్ణయం విషయాలలో పొరపాట్లు చేయవచ్చు. రోగి పరిస్థితి విషమించే స్థితికి రావచ్చు. ఎమర్జెన్సీ కేసులను నిర్ణయింపడం తెలియక పోవడంవలన రోగికి హాని సంభవించవచ్చు. అప్పుడు యీ వ్యవస్థలోని పద్ధతులకు విధానాలకు సానుభూతి దూరం కావడం జరుగుతుందేమో. అలాంటి విషయాలు సమగ్రంగా చర్చించాలి. అల్లోపతిలో ప్రాక్టికల్ శిక్షణ పొందుట సామాన్య విషయం కాదు. సులభసాధ్యమైనది కాదు. కనుక యీ విషయాలన్నీ శ్రీ డా. షణ్ముగంగారు, వివిధ అల్లోపతి వైద్య నిపుణులతోను, వివిధ హోమియో, ఆయుర్వేద, వైద్య నిపుణులతోను బాగుగ ఆలోచించి, సంప్రదించి, ప్రభుత్వ దృష్టికి, సాధక బాధకాలను, దాని ఉపయోగాలను వివరించి ఒక సమగ్ర పథకాన్ని రూపొందించి కృతకృత్యులు కావాలని కోరిక.

ఎ. యమ్. టి. సి. లోని వ్యాసాలు, సభ్యులకు చదువరులు అందరికీ, సులభగ్రాహ్యముగ, సులభ శైలిలో, కావలసిన వేరు వేరు విషయములను సేకరించి, ప్రచురించుట, ప్రయాసతో కూడిన పని. అందుకు వారి నభినందించాలి. తెలుగు తమిళం, ఆంగ్లములతోబాటు, హిందీలో కూడా వ్యాసాలు ప్రచురించితే ఉత్తర భారత దేశంలో కూడా సహకార, సానుభూతులు మరింత ఎక్కువగా లభ్యం కాగలవని అనిపిస్తుంది. డా. షణ్ముగంగారి ఆశయము, కృషి ఫలించి వారు చేపట్టిన యీ బృహత్కార్యము సఫలము కావాలని అందరి ఉద్దేశము, కోరిక కూడ.

—వి. యస్. రావు

## జీవఫలం : (నవల)

రచన: శ్రీ ఐ. జె. రావు. ఎమెస్కో పాకెట్ సైజు. 128 పేజీలు. వెల:రూ 2—50. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో., మచిలీ పట్నం, మదరాసు, సికింద్రాబాదు.

'నాకు అన్నీ పోయాయి పార్వతీ— కాని రెండు మాత్రం బతికి వుండగా పోవు: నేను అబద్ధం ఆడను, ఒకళ్ళ దయ నాకక్కర్లేదు—' రామదాసు తనను గురించి తను చెప్పుకున్న ఉపోద్ఘాతం ఇదీ.

ఈ రెండు లక్షణాలే అతనికి జీవితంలో గొప్ప షాక్ నిచ్చాయి. ఈ రెండు విశిష్టతలే అతన్ని ఆకర్షించేలా, అతన్ని గురించి 'అయ్యో పాపం!' అని జాలిపడేలా చేశాయి కూడా.

అయితే— అతని జీవితాన్ని గిరగిర తిప్పి, చివరికి గట్టెక్కించినవి కూడా ఈ రెండు ఆదర్శాలేనా?— కావచ్చు. మరి— అంతటి ఆదర్శవాదిలోనూ ఇంత పిరికితనం ఎలా చోరబడింది, పరిస్థితుల ప్రభావం గాక?—

ఆదర్శాలకూ పిరికితనానికీ, నీతి నిజాయితీలకూ పరిస్థితుల ఒడుదుడుకులకూ మధ్యని పోరాటం. ఆ పోరాటంలో ఒక జీవుడి ఆరాటం.

ఆ జీవుడే రామదాసు. అతని గాథే ఈ 'జీవఫలం' జీవిత లక్ష్యాల ప్రయోజనాన్ని సాధించే ఒక మానవ జీవిత తరంగం.

—శివకుమారి

## అయిదు ఏక పాత్రాభినయాలు

'నాగశ్రీ' రచించిన శ్రీకృష్ణుడు, అంజనేయ, అభిమన్య, రామదాసు, ఇంద్రజిత్తు ఏకపాత్రాభినయాలు మా కార్యాలయం చేరాయి. ఒక్కొక్కటి 16 పేజీలు గల ఈ అయిదు పుస్తకాల వెల ఒక్కొక్కటి 75 పైసలు. ప్రతులకి ఉదయ సాహితి పబ్లికేషన్సు, మహంతిపురం, విజయవాడ— 1 కి రాయాలి.

## సగుణ నిర్గుణతత్త్వ శ్రీరామ కందములు

శ్రీ పి. వి. ఎస్. పాత్రో రచించిన 'సగుణ నిర్గుణ తత్త్వ శ్రీరామ కందములు' మా కార్యాలయం చేరింది. 32 పేజీలుగల ఈ పుస్తకం అమూల్యము. ప్రకాశకులు: కొల్లా సత్యారావు అండ్ బ్రదర్సు, మిర్తివలస, పాచిపెంట (పోస్టు), శ్రీకాకుళం జిల్లా.

## శివశతకము

శ్రీ దరిమడుగు వెంకట సుబ్బయ్యచే రచింపబడిన 'శివ శతకము' మా కార్యాలయం చేరింది. 32 పేజీలుగల ఈ పుస్తకం వెల రూపాయిపావలా. ప్రతులకి రచయిత, కుల్లూరు, నెల్లూరు జిల్లాకి రాయాలి.

## శ్రీ కుల్లూరు రామదేవశతకము

శ్రీ దరిమడుగు వెంకట సుబ్బయ్యరాసిన 'శ్రీ కుల్లూరు రామదేవశతకము' మా కార్యాలయం చేరింది. 28 పేజీలుగల ఈ పుస్తకం వెల రూపాయి పావలా. ప్రతులకి శ్రీ డి. రమేష్‌కుమార్, ఇం. నెం: 10—2—289/76, శాంతినగర్, మల్లేపల్లి, హైదరాబాదు— 28 కి రాయాలి.

## విశ్వవికాస్

శ్రీ క్రొవ్విడి లింగరాజు గౌరవ సంపాదకత్వంలో శ్రీ పాదవాల ప్రేమనాథ్ సంపాదకత్వాన వెలువడుతున్న పక్ష పత్రిక, 'విశ్వవికాస్' రెండవ సంచిక మా కార్యాలయం చేరింది. 48 పేజీలు, వెల 40 పైసలు. ప్రతులకి విశ్వవికాస్, విక్రమహాల్, రాజమండ్రికి రాయాలి.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Sambhu Prasad.

# వెంకన్న కోపు

3



























(ఇంకా ఉంది)

